# భుమానంద బోధ ప్రకాశిక






mohan PUBLICATIONS

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.




శ్రీ ర స్తు.

శ్రీగురుపాదుకాభ్యాన్నమః

# భూమానందబోధ ప్రకాశిక.

ఇది

సకలముముక్షుజనులకు నత్యంతోపకారముగా
విద్యారణ్య ప్రణీతపంచదశి జీవన్ముక్తప్రకాశిక
వాసిష్టరామాయణాది శ్రుతిస్మృతేతిహాస
పురాణరత్నముల సహాయముగాగాని
నెల్లజనులును బ్రహ్మవిద్య విస్పష్టంబుగా దెలిసి
సర్వసందేహముల నివారణ[illegible]గునట్టుల శ్రీమత్పరమ
హంసపరివ్రాజకాచార్య శ్రీమద్బ్రహద్వాసిష్ట
సిద్ధాంత నిర్ధారకులగు
భూమానంద అన్నావధూతస్వాములకున్ను
భూమానంద కనుపర్తి-వేంకటరామవిద్యానందనాథులకున్ను
ప్రియశిష్యుండగు హైదరాబాద్-గోషామహల్ నివాసులగు
బుద్ధవరపు- కోండలరాయచిదానంద
యోగులచే రచియింపబడి

చెన్నపురి
[illegible]గు - సుబ్బరామయ్య అండుసన్ గార్ల
హిందూరత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రింపింపంబడి ప్రకటింపంబడియె.

౧౯౦౧ - సం॥



వెల అణాలు - ౮.



శ్రీరస్తు.

శ్రీగురుపాదుకాభ్యాంనమః.

# భూమానంద బోధ ప్రకాశిక.

హరిః ఓం॥ శ్రీమత్సదానంద మచింత్య మవ్యయం శ్రీమత్సదానంద మఖండ మద్వయం । శ్రీమత్సదానంద మనంతమచ్యుతం శ్రీత్సదానంద గురుంస్స్మరామి॥ ❋

## ఇష్టదేవతానుసారము.

ఓంకార పంజరశుకీ ఓంకారార్థస్వరూపిణీ । కోండలరాయత్సిదానందం కరోతు ధవమంగళం ॥ ౧ ॥ భూమానందలహరి పరబ్రహ్మస్వరూపిణి । కోండలరాయ త్సిదానందం కరోతు ధవమంగళం॥ ౨॥ అమ్నాయ భూతపరమహంసరాజ శిఖామణే । కోండలరాయ త్సిదానందం కరోతు ధవమంగళం ॥ ౩ ॥ వేంకటరామ త్సిదానందం వేదవేదాంత భూషణం । కోండలరాయ త్సిదానందం కరోతు ధవమంగళం ॥ ౪ ॥ సనకాది సమారాద్యా సర్వకామ్యార్థ దాయినీ । జననీతవ దాసానాం కరోతు ధవమంగళం॥ ❋

## పారంపర్య గురుస్తోత్రము.

సత్సిదానంద రూపాయ సత్యైశ్వర్య ప్రదాయకా । వేదవేదాంత సూర్యాయ వసిష్ఠాఖ్య గురుంభజే॥ చైతన్య మేకంబ్రహ్మంసర్వ భూతాంత రాత్మకం । సర్వశృతి సిరోరత్నం కృష్ణంవందేజగద్గురుం॥ అజ్ఞానమూలహరణం అష్టైశ్వర్య ప్రదాయకం । అచ్యుతం బప్రమేయం శ్రీశంకరార్య గురుంభజే ॥ విద్యానందం వేద్యరూపం విద్యాకారా వినాశినం । విద్యాప్రదం విద్యనిధిం విద్యారణ్య గురుంభజే॥ ❋

శ్రీమదఖిల వేదాగమ శ్రుతి స్మృతీతిహాస సత్ శాస్త్రార్థ సార

మునుగ్రహించి ముముక్షు జనోపకారముగా సర్వజనులకు స్పష్టముగా దెలియునట్లాంధ్ర భాషయందు ప్రబంధ రూపంబుగా భూమానంద బోధ ప్రకాశికయను గ్రంథము శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్బృహ ద్వాసిష్ఠ సిద్ధాంత నిర్ధారకులైన భూమానంద అన్నావధూత స్వాములకున్ను భూమానంద వేంకటరామ విద్యానంద నాథులకున్ను శిష్యుడగు కొండలరాయ చిదానందయోగిచే రచియింపంబడి మోక్షైక ప్రధానమగు వైరాగ్య ప్రకరణము ముందుగా నారంభింపబడియె॥

## వైరాగ్య ప్రకరణము.

సత్య జ్ఞానానందాద్వయ బ్రహ్మనిష్ఠయందుండు గురురాయని పాదపద్మములసన్నిధికి పూర్వజన్మ సుకృత పరిపాకంబున నొకసజ్జనుండు సకలమైన వేదశాస్త్రములం జదివి దేనిచేత తృప్తిగానక దైవవశంబున స్వేచ్ఛగా నేతెంచి చూచి యీమహానుభావునివలన నీసంసార సాగరమును తరింతునని యతనికి నిష్కాపట్య భక్తియుక్తుండై సాష్టాంగ నమస్కారముం జేసి లేచినిలచి నిటలతట ఘటితాంజలి పుటుండైయున్న శిష్యుని కరుణారస సముద్రుండగు గురుండు మెల్లన చల్లని చూపులంజూచి కూర్చుండ నియోగించి యోవత్సా నీభక్తి విశ్వాసంబులకు [illegible] సంతోషంబయ్యె నీవు మాసన్నిధికి యేమి యపేక్షించి వచ్చితివో వేడు మిచ్చెదమనిన శిష్యుండిట్లనియె. హే పరమగురూ ఈసంసార సాగరమందు బహుకాలమునుండి మునుగుచుం దేలుచుం దరిగానక శ్రమబొంది నేటికి భవసాగర తరణోపాయమగు తమపాదారవిందముల నాశ్రయించినవాడను నామొరవిని రక్షించెదుకర్తదేవరవారెయని త్రికరణ శుద్ధిగా చతుర్విధ శుశ్రూషలంజేయు శిష్యునింజూచి అవిద్యావరణ రహితమౌనట్లు నాశీర్వదించి॥ శ్రుతి ॥ తరతి శోకమాత్మవిత్ ॥ అని శ్రుతిప్రమాణము గనుక నాత్మజ్ఞానముచే దుఃఖమను సాగరము తరింతురని ప్రమాణము ఇందుకు జ్ఞానోపదేశమే సేయువలయును ॥ శ్రుతి॥ జ్ఞానమేవా మోక్షః యనియు ॥ జ్ఞానంవినా మోక్షో

నసిధ్యతి అనియు శ్రుతులు పలుకును ॥ యిందుకు సాధనము భక్తి వై రాగ్యములు గనుక యిందు వైరాగ్యము దెలియునా యనిన శిష్యుం డిట్లనిమె. స్వామీ జ్ఞానమెరుంగ భక్తినెరుంగ వైరాగ్యమునెరుంగ దే వరవారే తెలిపి కడతేర్చ వలయుననిన శ్రీగురుం డిట్లనియె. ఓశిష్యా, మావాక్యములయందు మనస్సునుంచి ఇతరసంకల్పములనువిడిచి మేము చెప్పిన యర్థమువిని సంశయముగలచోట యడిగితెలుసుకొనును నేకా గ్రచిత్తముగలవాడవైవినుము. వైరాగ్యమనగా ఈషణత్రయవర్జితుండై దేహాభిమానాది వాసనలను విడుచుటయే వైరాగ్యం బనంబడును. ఈషణత్రయమనగా ధనేషణ, ధారేషణ, పుత్రేషణ లనంబడును. ధనే షణ యెట్టిదనిన, ధనమోలేనికాలమందు లేకపోయెనను దుఃఖము, ధ నార్జనకాలమందును దుఃఖము, వ్రయకాలమందు మిక్కిలి దుఃఖము, రాజచోర ధారాపుత్రాదు లెక్కడ నపహరింతురోయని సర్వదాదుః ఖము, కాబట్టి ఓయిశిష్యా ఈధనేషణ దుఃఖమును నివారింపజేయు వి వేకను వాసిష్ఠరామాయణము ఉపశమప్రకరణములో జనకమహారాజు చేత చూపింప బడినది.

శ్లో॥ అద్యామే మహతాంమూర్ధ్నిః తేదినైర్నిపతంత్యధః।
హంతవిత్త మహత్తాయాః కైషావిశ్వ స్తతాతవ॥ ౹

తా॥ ఈకాలమందు ధనసమృద్ధిచేత నధికులగు వారికంటె హెచ్చుగానుండు పురుషులు మరికొంచదినములకే ధనమంతనశించిపర మదరిద్రులై యుందురు అప్రకారముగా మనము చూచుచున్నాము గ నుక ఓచిత్తమా నీకు ధనాధిక్యమందింత నమ్మకమెందుకు కలుగవలయు ను ఓచిత్తమా ఈధనమును శాశ్వతమనినమ్మి విఱ్ఱవీగతగదని భావము॥

శ్లో॥ క్వధనాని మహీపాలాం బ్రాహ్మణఃక్వ జగంతివా।
ప్రాక్తనాని ప్రయాతాని కేయంవిశ్వ స్తతాతవ॥

తా॥ నల హరిశ్చంద్ర మహారాజులయొక్క ధనసమృద్ధులు యెంతహెచ్చుగా నుండెను బ్రహ్మచేత నిదివరకు పుట్టింపబడిన లోక ములు యెంతబాగా యుండెను అనియున్నియు యిప్పుడు యెక్కడికి

బోయెను వాటిలో కొంచమైన యిప్పుడు కానబడవుగదా గనుక యి ప్పుడు కనబడే ఈధనమందు ఓమూర్ఖచిత్తమా నీకు యింత విశ్వాస మెందుకు ఈధనము స్వల్పకాలములోనే నశించిపోవును॥

శ్లో॥ కోటయో బ్రాహ్మణాంయాతాః గతాఃసర్గ పరంపరాః।
ప్రయతాః పాంశువ ద్భూపాః కాథృతి ర్మమ జీవితే।

తా॥ అనేకలక్షల యుగములు జీవించుబ్రహ్మలు యింతవరకు అనేకకోట్లు నశించి పోయినారు అనేకకోట్ల సంవత్సరములు స్థిరము గానుండు బ్రహ్మాండములు లెక్కలేనివి నశించిపోయినవి యికను నల నహుష హరిశ్చంద్రాది రాజులు అనేకకోట్లు దుమ్మువలె యెగిరిపోయి నారు ఈలాగునుండగా నాబ్రతుకు యెంతకాలము నిలచును దీనియం దు నేను యెందుకు విశ్వాసము చేయవలయునని శ్రీరాముడు విచా రించెను కాబట్టి ఓయిశిష్యా మనజీవితమిట్లుండ ఈ అనిత్యమైన ద్రవ్య మందుండు నీకోర్కెను మంటగలపి శాశ్వితుడైన పరమాత్మను దెలుసు కొమ్మన శిష్యుండిట్లనియె. స్వామీ ధారేషణంబెట్టిదో దెలుపమన ధా రేషణ దెలుప నుద్యోగించి గురుం డిట్లనియె॥

ధారేషణవివరణము.

ధారేషణ మెట్టిదనిన కామాతురుడై రక్తమాంస, మల,మూ త్ర దుర్గంధములచే నింపబడ్డ యంగములుగల స్త్రీభోగములం జిక్కు బడి దుఃఖమునే యనుభవించుచు సుఖమని మాటిమాటికి తలంచుచు వీరిని పోషించుటకై శునక సూకరాదులవలె సిగ్గువిడచి కృషి వాణిజ్య సేవకాది అధర్మ నీచవృత్తుల కొడంబడు మూడు లయవివేకమే ధారే షణ మనంబడును. కాబట్టి ఓయిశిష్యా స్త్రీవిషయమైన సంతోషమును నివర్తింపజేయు వివేకము వాసిష్ఠరామాయణములో చెప్పియున్నారు॥

శ్లో॥ మాంసపాం చాలికాయాస్తు యంత్రలోలేఁగపంజరే।
స్నాయ్వస్థి గ్రంధిశాలిన్యాః స్త్రియాః కిమివశోభనం॥

తా॥ నరములు యెముకలు వీటియొక్క గ్రంధులుగల స్త్రీ యనే మాంసపు బొమ్మయొక్క యంత్రముచేత చలించు శరీర పంజర

మందు యేమి మంచికలదు దీనిచూచి యేల మోహించెదరు అని చెప్పి యున్నారు॥

శ్లో॥ త్వఙ్మాంస రక్తబాష్పాంబు పృథక్కృత్వా విలోచనే ।
సమాలోక యరమ్యంచే త్కింముదా పరిముహ్యసి ॥

తా॥ ఓరిమూర్ఖుడా స్త్రీలయొక్క నేత్రములను చూచి మిగుల మురియుచున్నావు ఈనేత్రముయొక్క స్వరూపమును విచారించి చూడుము ఈనేత్రము చర్మము, మాంసము, రక్తము, నీరు, వీటియొక్క సంయోగముచేత నేర్పడినవి ఈవస్తువులను ప్రత్యేకముగా విచారించితే యేమైన మంచియున్నదా అంతయు అసహ్యముగానే యుండును గనుక కనులనుజూచి మోహమును పొందకుము॥

శ్లో॥ మేరుశృంగతటోల్లాసి గంగాజలరయోరమా । దృష్ట్వా
యస్మిన్ స్తనేముక్తా హారస్యోల్లాసశాలితా । స్మ
శానేషుదిగంతేషుస్సఏవలలనా స్తనః। శ్వభిరాస్వాద్య
తేకాలే లఘుపిండఇవాంధసః॥ *

తా॥ మేరుపర్వతముయొక్క శిఖరమందు ఆకాశగంగాప్రవాహము యేప్రకారము ప్రకాశించుచుండునో నాప్రకారమే స్త్రీలయొక్క స్తనమండలమందు ముత్యాలహారము ప్రకాశించుచున్నదని చూచి నిండా ఆనందమునుపొందుచున్నావు ఈస్త్రీ స్తనమేచివరకు స్మశానములోపడి అన్నపుముద్దవలె కుక్కలచేత కవిశికవిశి భక్షింపబడును యిట్టిఅంత్యపు స్థితిని ఆలోచించగా స్త్రీ స్తనమందు ఏమిసుందరమున్నదో తెలియవలయును॥

శ్లో॥ కేశకజ్జలధారిణ్యోదుస్పర్శాలోచనప్రియాః । దుష్కృ
తాగ్నిశిఖానార్యోదహంతితృణవన్నరం॥ *

తా॥ జనులయొక్క పాపములచేత సంపాదింపబడిన దీపజ్వాలలేస్త్రీలు దీపములకు నల్లనికొనలున్నట్లుఈస్త్రీలకు నల్లనిదలవెంట్రుకలుకలవు దీపములుముట్టుకుంటె కాల్చును స్త్రీలుముట్టుకుంటె అంటుకొనివచ్చి బ్రతికినంతకాలము బాధించుచుందురు. పాపాత్ములు...

ఉనప్పుడు దీపములవలె సొగసుగాకనపడుచుందురు తమతోచేరినమ నుష్యులను దీపములు గడ్డికుప్పలనుదహించినట్లు కాల్చుచుందురు॥

శ్లో॥ జ్వలతామతిదూరేపి సరసాఅపినీరసాః । స్త్రియో హినరకాగ్నీనా మింధనంచారుధారుణం॥ ✱

తా॥ అతిదూరమందనగా యమలోకమునందు మండుచుండె నరకములనే యగ్నులకుస్త్రీలనేపదార్థములు తడిగలిగినవిగా నున్నప్ప టికి యెండిపోయిన మంచికట్టెలని యెంచతగియున్నవి అనగా నరకా గ్నులను మండింపజేయుటకు స్త్రీలుమంచియెండుకట్టెలవంటివారని భా వము॥

శ్లో॥ కామన్మహాకిరాతేనవికీర్ణానుగ్ధచేతసాం। నార్యోనర విహంగానా మంగబంధనవాగురాః॥ ✱

తా॥ మన్మథుడనేకిరాతునిచేత తెలివిలేనిమనుష్యులనే పక్షుల నుపట్టుటకుగాను స్త్రీలనే వలలు అంతటవ్యాపింపబడినవి అనగాస్త్రీల యందాసక్తిగలవారు వలలోజిక్కినపక్షులవలె నిండాబాధపడి స్వ రూపమునునశింపజేసుకొందురుగనుక యెంతమాత్రము స్త్రీలయందా సక్తిని పొందకూడదనిభావము॥

శ్లో॥ సర్వేషాందోషరత్నానాం । సుసముద్గికయానయా। దుఃఖశృంఖలయానిత్యామలమస్తుమమస్త్రియా॥ ✱

తా॥ రత్నములకుభరణివలెనె సమస్తపాపములకు నిధానమ గుస్త్రీలు దుఃఖమువలనపుట్టినకాలి సంకెలలవంటివారు యిట్టిస్త్రీలతో పొత్తుచాలును వీరితోపొత్తుచాయగూడదు॥

శ్లో॥ ఇతోమాంసమితోరక్త । మితో స్త్రీనతివాసరైః । బ్రహ్మాన్కతిపయ్యైరేవ । యాతిస్త్రీవిశరారుతాం॥

తా॥ యిచ్చటరక్తమున్నది యిచ్చటమాంసమున్నది యిచ్చట యెముకలున్నవిఅని ఈప్రకారంవిచారించగా కొన్నిదినములలోనె స్త్రీ శరీరమువిషమువలె భయమునుకలుగజేయును॥

శ్లో॥ యస్యస్త్రీతస్యభోగేచ్ఛ । నిస్త్రీకస్యక్వభోగభూః ।
స్త్రీయంత్యక్త్వాజగత్యక్తం। జగత్యక్త్వాసుఖీభవేత్॥

తా॥ యెవనికిస్త్రీకలదో వానికిభోగమునందభిలాషయుండును స్త్రీలేనివానికి భోగవాంఛవుండనేరదు స్త్రీనివిడిచినపక్షమునకు ప్రపంచమునంతా విడిచినవాడౌను.యనియిట్లు శ్రీరాములవారిచే విచారింపబడెను గాబట్టి నీవు ఈవివేకముగలిగి పరబ్రహ్మమునుపొందుమన నాశిష్యుండుస్వామి పుత్రేషణ యెట్టిదో తెల్పుమన దయాసముద్రుండగు గురుమూర్తియిట్లనిచెప్పందొణంగె. ఓరిపుత్రా ఈపుత్రేషణవిషయమందు బ్రహ్మవేత్తలకు వినహాయితరులైన కొందరుపండితులును పామరులును వేదశాస్త్రేతిహాసపురాణాదులయందుగల ॥ పుత్రేణలోకాన్జయతి అపుత్రస్యగతిర్నాస్తి పున్నామ్నోనరకాత్త్రాయత. ఇతిపుత్రః॥ పున్నామ్నోనరకాద్యస్మాత్ పితరంత్రాయతేస్వయం॥ స్మాపుత్రఇతిప్రోక్త స్స్వయమేవస్వయంభువః॥

క॥ వినుగార్హపత్యమనునగ్న్యనలము । విహరింపబడితరాహవనీయం । బనవెలుగునట్లువెలుగును। జనకుండాబుత్రుడైజన్మ్యతితోడన్॥

క॥ తానతననీడనీళ్లలలోనేర్పడదోచునట్లులోకస్తుత । తల్చూలుజనకుండుచూచి మహానందముబొందునతిశయప్రీతిమెయిన్॥

క॥ నీపుణ్యానునువవలననయీపుత్రకుడుద్భవిల్లి । యింతయునొప్పెన్ । దీపంబువలననొండొక దీపముప్రభవిల్లినట్లు । దేజంబెసగన్॥

మ॥ విపరీతప్రతిభాషలేమిటికి నుర్వీనాథ ఈపుత్ర । గాత్రపరిష్వంగసుఖంబుజేకొనుము । ముక్తాహారకర్పూర సాంద్రపరాగప్రసరంబుచందనము చంద్రజ్యోత్స్నయున్ । పుత్రగాత్రపరిష్వంగమునట్లుజీవులకుహృద్యంబేకదున్శీతమే॥

క॥ అనుదినసంశోషణములు జనితశ్రమతాపదుఃఖసంశోషణములేతనయులసంభాషణములు। జనకులకును కర్ణయుగళసద్భూషణముల్॥

అనుశ్రుతులనుస్మృతులను పద్యములను చదివియునువానికిసాజమైన అర్థమును తెలియక విపరీతార్థములను నూహించి అవేసత్యములని

పుత్రులుగలవారికే యిహపరలోకములయందు సుఖముగలదని లేనివారికి సుఖములేదని పుత్రులుతల్లిదండ్రి వంశమువారినెల్ల పుణ్యలోకములకు పంపుదురని పుత్రులవలననే గాని పితృఋణంబుతీరదని తామూభ్రమించుటయే గాక లోకులనుసహితము భ్రమపెట్టుచున్నారు కాబట్టి పుత్రులవలన ఈలోకమందును స్వర్గమందును మోక్షమందును ప్రయోజనమేమాత్రములేకపోవుటను పుత్రులులేనివారు సహితము పుణ్యలోకప్రాప్తికలిగి ముక్తులగుటయు పుత్రులుగలిగియును వారుతమకంటెవేరం దుగాచచ్చినతమతమపుణ్యకర్మ యోగాభ్యాసములచేత నేసద్గతులనుపొందుటను పుత్రులుపుట్టకమునువును పుట్టినవెనుకను పుట్టిచచ్చినతరువాతను అధికదుఃఖములను గలిగించుటను చూచున్నారము కాబట్టి పుత్రశబ్దమునకు నిజమైన అర్థమునువివరింపబడుచున్నది వినుము.

శ్లో॥ అలభ్యమాన స్తనయః పితరౌక్లేశయేచ్చిరం । లబ్ధోయి గర్భపాతేన ప్రసవేనచబాధతే । జాతస్యాగ్రహరోగాది । కుమారైస్యచధూర్తతా ॥ ఉపవీతేప్యవిద్యత్వామనుద్వాహశ్చపండితే। యూనశ్చపరదారాదిదారిద్ర్యంచకుటుంబినః । పుత్రదుఃఖస్యనాస్త్యంతో ధనచెంద్రియుతేతధా। ఏవంవివిధ్యపుత్రోసౌప్రీతింత్యక్త్వాసిజాత్మని । నిచ్చిత్యపరమప్రతెంవీక్షతేతదహర్నిశం॥

తా॥ అనియాజ్ఞవల్క్యోపనిషత్తు ఘోషించుచుండుటంబట్టి పుత్రులుపుట్టియును పుట్టకయును తల్లిదండ్రులకు మెల్లప్పుడుదుఃఖమునె యిచ్చుచున్నారు ఎట్లనగా పుత్రులులేనివారు అపుత్రులైతిమనేదుఃఖముచేత ఒకబ్రాహ్మణునిరావించి పెద్దగద్దియపైకూచుండబెట్టి మాటికిమాటికిదండములుపెట్టి స్వామీమాకు కొమారులులేకపోయిరేమాకేమిగతియని దుఃఖించుచున్నవారిని నతడుజూచి మీరుదుఃఖింపవలదని కొన్నిశాస్త్రములపారజూచి మీరుపాపాత్ములుకాబట్టి మీకుకొమరులులేనివారైతిరి కావునకాశీరామేశ్వరాది పుణ్యతీర్థములశేవించిన మీపాపములునశించి పుత్రవంతులగుదురన యతనిపాటించితీర్థయాత్రలను

బహుదినములు చేసి స్నానదానములు తిలహోమములు సర్పశాంతులు
నాగప్రతిష్టలు అశ్వద్థప్రదక్షిణములు మొదలైనవి మాటిమాటికి చేసిచేసివి
సికివిసికి వేసరి దారినడచు బడలికచేతను వకరాసిభోజనాదులు లేకపోవుట
చేతను కలిగెడి శరీరశ్రమ మొదలగు సకలదుఃఖములును ననుభవించియు
ను తమకోర్కెనెరవేరక మరియొక మంత్రశాస్త్రవేత్తను రావించి తమ
అభిప్రాయమును దెలిపి యిందుకేమైనా వుపాయంబు చెప్పుండనిన అత
డు మీకు గ్రహములు పట్టియున్నవి కాబట్టి పెద్దగండదీపమును పెట్టి మం
త్రోచ్చారణమును చేయించి ముగ్గులు వేసుకొని మంత్రింపించి ఆప్రతిబంధ
ములను తొలించుకొంటిరేని పుత్రులు కలుగుదురని చెప్పగా ఆమాటలు
విని అందుకుతగిన యత్నములు చేయగా ఆమాంత్రికుడు పుట్టమ్మ మాచ
కమ్మ మాతంగి సహాదేవి మొదలైన దేవతలకు తృప్తిచేయవలయునని
వారిచేత విశేషధనము కర్చుచేయించి యికమీకు బిడ్డలు పుట్టుటకు ఆటం
కము లేదని పోయెను అప్పుడు కొన్నిదినములు యెదురుచూచి సంతానము
లేక దుఃఖములతో ములుగుచుండేలుచు ॥

శ్లో॥ కోటరాంతద్భహోవహ్నా తరుమేకందహ్యతి ।
కుపుత్రస్తుకులేజాతః స్వకులంనాశయేత్పరం॥ *

తా॥ అనియుండుటవలన సద్గుణసంపదగల పుత్రుడు గలుగవల
యునని భగవంతుని ప్రార్థించుచుందురు కాబట్టి పుట్టినపుత్రులు తల్లిదం
డ్రులను బహువిధముల దుఃఖములం బెట్టుచున్నారనుటకు సందేహము
లేదు॥

ఇక పుట్టినపుత్రులు దుఃఖపెట్టుట యెట్లనిన సంతానకోర్కె
గలవారికి దైవాధీనంబున తనంతటనే గర్భము నిలచి యెదియైన వాక
కర్మమువలన కొన్నాళ్లకు కడుపు దిగబడును అందున తల్లిదండ్రులు
దుఃఖింతురు ఆగర్భము పదినెలలసమాప్తి నిలచెనా ప్రసవకాలవేదన
చేత మితిలేని బాధలు కలుగగా ఆబాధలు చూడజాలక మంత్రసాని
మొదలగువారు అయ్యా వెంకంభట్లుగారు మీభార్య వేదనచేత మిక్కిలి
బాధపడుచున్నది ప్రార్థనలేవైనా చేయుండన అప్పుడతను దుఃఖమున

ముసింగి అయ్యో నేను ప్రార్థనలను మునుపే చేసితిని ఈకుమారునికి ఆశపడినందుకు కొండరాలుకను మందుపెట్టితే వున్ననాలుక వూడి పోయినట్లు పెద్దప్రాణమునకే హానివచ్చెను యిక నేనేమి చేయుదును అదిబ్రతికితే చాలును దేవుడు మన్నును సకలవిధముల దుఃఖపెట్టుచు న్నాడు గనుక ఓయిశిష్యా పెద్దప్రాణమునకు మోసమొచ్చెనేసిఅందు వలన దుఃఖమే ప్రాప్తించుచున్నది అటుగాక సుఖముగా పుట్టినాపుట్టి నవానికి పుట్టుదోషము పక్షిదోషము సందుకట్టులును పిశాచి మొద లైన తొందర్లు కలుగును అవిచూచి పుట్టినవానికి రక్షలుకట్టించి విభూ తిమంత్రింపించి పడరానిశ్రమలనుపడి పెంచుదురు పిమ్మటగుండాగొయ్య తనముచేసినను వుపనయనము కాకపోయినను విద్యరాకపోయినను వి వాహము కాకపోయినను వానికి బిడ్డలులేకపోయినను బిడ్డలనుపోషింప ధనములేకపోయినను పరస్త్రీగమనము చేసినను ఈతలిదండ్రులకుదుః ఖమే ప్రాప్తించును మరియు తల్లిదండ్రులు యీకొమారుని కష్టముల చూచి మిగుల విలపింతురు యిందువలన పుత్రుడు దుఃఖపెట్టినవాడే యౌను కాబట్టి పుత్రుడు కల్గిన లేకున్న తలిదండ్రులకు దుఃఖమే కలు, గుట సర్వజనానుభవ సిద్ధము యీపుత్రునివలన సద్గతి గలుగుటయేమి నిజము తలిదండ్రులు చచ్చినవారిని గురించి పుత్రులుచేయు దానములు శ్రాద్ధములు తర్పణములు మొదలగునవి వారికి సద్గతిని తృప్తిని గలుగిం చునని వేదశాస్త్రములు వక్కాణించును గనుక పుట్టి చచ్చినను పుత్రు డే మేలను లోకోక్తినిపట్టి దుఃఖములెన్ని కల్గచేసినా పుత్రుడుండివాడా లునసిన ఈకొడుకులుచేయు దానశ్రాద్ధాదులు తల్లిదండ్రులకు సద్గతిని తృప్తిని కలిగించునను టు సత్యమైన పక్షమున తలిదండ్రులు బ్రతికియుం డ పుత్రుడు వారిపేరు చెప్పికొందురు బ్రాహ్మణులకు షడ్రసోపేతము గా యిష్టపదార్థములతో తుష్టిగా భోజనమును పెట్టి ఈతలిదండ్రులకు భోజనముపెట్టనియెడల ఆబ్రాహ్మణులు భుజించి తృప్తిపొందినా యీ తలిదండ్రులు తృప్తిపొందుటలేదు అట్లుండ వారు మరణించినవెనుక పు త్రులుచేయు దానశ్రాద్ధాదికము వారికి సద్గతిని తృప్తినికలిగించుననుట

వాకఱ పరి టకఱని చెప్పవకఱరలేదనిన ఓగురుదేవా పితృదేవతలను గురించిచేయు దానశ్రాద్ధ ధర్మములు వ్యర్థములా యనిన ఓయి వత్సా కారణములేక కార్యంబీలోకమందు గలుగదు గావున వారిపేరుపెట్టిపుత్రుడుచేయు దానాదులు పుత్రునిసద్గతికే కారణంబులగుగాని వ్యర్థంబులుకావు మరియు కర్మకాండవిధులు స్థూలశరీరమునువిడిచి జీవుడు సూక్ష్మశరీరంబుతో చంద్రలోకంబుచేరి భోగములనుభవించి వెనుకమేఘములోపడి జలమై ఆజలము తనజన్మానుగుణమగు జంతువునకు ఆహారంబగు ధాన్యంబులోపడి అన్నమై ఆవలరక్తమై శుక్లమై స్త్రీగర్భంబునఁ బ్రవేశించి జన్మించునని చెప్పుదురు ఓయిశిష్యా వైరాగ్యపరతిగల జ్ఞానకాండవిధులు జీవుండు తేజోమార్గమున సూర్యలోకమును బొందియవల బ్రహ్మలోకంబుచేరి బ్రహ్మతోడ ముక్తినొందుదురందురు మరికొందరు జీవుఁడీశరీరంబునందుండియే వేరొకశరీరంబునందుఁ జొచ్చి పూర్వశరీరమువిడుచు నందురు యిందుకు ప్రమాణములు.

సీ॥ మేనితోడనుబుట్టు మృత్యువుజనులకు నెల్లినేఁడైన నూరేండ్లకైన । దెల్లంబుమృత్యువు దేహంబుపంచత నొందగర్మానుగుణుఁడై శరీరి। మాఱుదేహముజొచ్చి మరితొంటిదేహంబు పాయును॥ భాగవతము॥

శ్లో॥ జాతస్యహి ధ్రువోమృత్యుః ధ్రువంజన్మ మృతస్యచ।
అద్యవాబ్ధశతాంతేన మృత్యుర్వై ప్రాణినాంధ్రువః॥

అని భర్తృహరి వ్యాఖ్యానమందు గలదుగనుక తల్లిదండ్రులు మరల జననమెత్తినను లేక మోక్షము పొందినను పుత్రులువారినిగురించి చేయు పుణ్యకార్య ఫలములు వారినంటవు.

శ్లో॥ యస్మిన్‌జాతే భగేపూర్వే తస్మిన్నేవ భగేరమే।
యామాతాసా పునర్భార్యా యాభార్యా జననీతధః॥
యఃపితాస్స పునః పుత్రో యఃపుత్రస్స పునఃపితా।
ఏవంసంసార చక్రేణ కూపయంత్ర ఘటాదివ॥ ❋

తా॥ జన్మాంతరములయందు తనతండ్రియే తనకు పుత్రుడై పుట్టునని తనపుత్రుడే తనకుతండ్రియగునని తనభార్యయే తనకుతల్లియగు

అని తనతల్లియే తనభార్యయగునని భర్తృహరి వ్యాఖ్యానమునందుగల దు గనుక తలిదండ్రులకు పుత్రులవలన ప్రయోజన మేమియు లేదని భావము.

మరియు వ్రతార్కమునందు ఏకాదశీ గురువార వ్రతకల్పమున పూర్వజన్మ జ్ఞానముగల ఒకబ్రాహ్మణదంపతులు తమపుత్రునియింట యెద్దుగాను కుక్కగాను పుట్టియుండిరి ఆపుత్రుడు పితృశ్రాద్ధము వారి నిగురించి చేయుదినము ఆశ్రాద్ధపుసందడివలన ఆయెద్దునకు మేతవేయు మరచెను శ్రాద్ధమునకు తెచ్చియుంచినపాలలో పాము విషముక్రక్కగా ఆకుక్కచూచి పాలనునేలత్రోసెను. అదిజూచి ఆవంటచేత కట్టెతో కొట్టి కట్టివేసి దానికి ఆహారము పెట్టకపోయెను ఆవల శునకవృషభరూపముల దాల్చిన వాని తలిదండ్రులు అర్ధరాత్రమున ఆకలివలన వ్యాకులపడి మనకొరకు వీడుపెట్టెడు శ్రాద్ధమువలన మనకేమి తృప్తి గలిగెను వీడు మనకాహారము పెట్టకపోయెనని దుఃఖించుచుండ సకల జంతుభాషాజ్ఞానముగల ఆబ్రాహ్మణ కుమారుండు ఆమాటలనువిని నొచ్చికొనివానియాకలితీర్చెను. కాబట్టి ఓయిశిష్యా తలితండ్రులనుగురించి చేయుశ్రాద్ధాదులు తర్పణదానములు వారికి చెందుననుమాటలు యెటుల సత్యములవును.

మరియును సనకుడు సనందనుడు సనత్కుమారుడు సనత్సుజాతుడు నారదుడు హనుమంతుడు మొదలగువారు పుత్రులులేకనే సద్గతి జెందిరని లోకప్రసిద్ధమేకదా.

శ్లో॥ ఐశ్వర్యం శంకరంచైవ ఆరోగ్యం భాస్కరం తథా।
ఆయుష్యం సృష్టికర్తారం మోక్షమిచ్ఛే జ్జనార్ధనం ॥

తా॥ అనియున్నస్మృతినిబట్టి ॥ శ్రీమహావిష్ణువైన కృష్ణుని కొడుకుగాగన్న దేవకీవసుదేవులు కృష్ణుడు మరణించినవెనుక అర్జునునివలన ఆవార్తవిని పుత్రదుఃఖమనుభవించి మరణించి తమసుకృతవశమువలన నే సద్గతినిపొందిరి, ఓయిశిష్యా దేవకీవసుదేవులకు ఏమిలాభముకల్గెను మరియు మహావిష్ణువగు శ్రీరామమూర్తిని పుత్రునిగాగన్న దశరథ

మహారాజు పుత్రదుఃఖముచేతచచ్చి దేవేంద్రునిచేత గౌరవమునుబొం
దుచు రావణసంహారము తర్వాత బ్రహ్మ శివ దేవేంద్రాదిదేవతలు శ్రీ
రాముని జూడవచ్చినప్పుడు తాను వారితోవచ్చి శ్రీరామునిచేత
నమస్కరింపబడినట్లుశ్రీరామాయణమునందు చెప్పబడియున్నది గనుక
స్వర్గమునవసించుటయు శ్రేష్ఠులగు బ్రహ్మరుద్రాదులసేవించుటయు శ్రీ
రామునిపుత్రునిగాగనుటవలననేగదాయనిన ॥ శృతి ॥ జ్యోతిష్టోమోస్వ
ర్గకామోయజేత ॥ శృతియుండుటవలన ॥ ఓయిశిష్యా. ఈదశరథుడు
అశ్వమేధాదిక్రతువులుచేసినందువలనను తపస్సంపన్నులైనవసిష్ఠాది మ
హాఋషులను పూజించుటవలన స్వర్గలోకప్రాప్తియు బ్రహ్మాదిదేవతా
దర్శనంబును కలిగెనుగాని శ్రీరామునికొడుకుగాగనుటవలన కాదు. ఓయి
శిష్యా కొడుకుగాగనుటవలననేయనిన ॥ పునర్జన్మలేని పరమపదము
కలుగునుగాని తిరుగపుట్టుటకు హేతువగు స్వర్గలోకప్రాప్తికలుగదు
మరియు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడను తనపుత్రునివలన బహుదుఃఖము
లననుభవించి తుదకు వానికారణంబుననేచచ్చెను। మరియు ధృతరాష్ట్రు
డు దుర్యోధనాది నూరుగురుకొడుకులగని వారందరు మరణించుట
వలన పుత్రదుఃఖమనుభవించి తమపుణ్యకర్మచేత సద్గతిపొందిరి ॥ వారి
కొందరు పుత్రదుఃఖముచేతచచ్చి నరకమునేబొందిరి ॥ ఓయిశిష్యా ఈ
పుత్రులవలన దుఃఖము మరణము నరకములును కల్గుననుట యెల్లవారికి
తెలిసిన విషయమేకదా ॥ ఓస్వామీ ॥ అపుత్రస్యగతిర్నాస్తి యనెడి
శృతికిగతియేమి ॥ ఓయిశిష్యా ఆశృతికినిజమైన అర్థమునుచెప్పుచున్నా
మువినుము ॥ పుం ॥ అనెడుఘోరనరకమునుండి తలిదండ్రులను లేవ
నెత్తి రక్షించువాడు పుత్రుడని ఆశృతికిఅర్థము నరకమనగాదుఃఖము
స్వర్గమనగా సంతోషమని పెద్దలయభిప్రాయము ॥ ఇందుకు ॥ క ॥ తన
సంతోషమెస్వర్గము తనదుఃఖమెనరకమండ్రు ॥ యనిసుమతిశతకముగ
నుక ॥ తానుఏదియైనమహాదుఃఖములోజిక్కి తిక్కగొనిఆహారనిద్రలు
మాని ప్రాణముపోవలయునను నిశ్చయము గలిగియుండునపుడు తనకు
దేహముమొదలుగాగల సర్వప్రపంచముకల్లయని ప్రపంచవిలక్షణమైన

పరబ్రహ్మమేసత్యము ॥ అటువంటిపరబ్రహ్మరూపుడగు నాకుదుఃఖములేకయుం
డిరిఅను దివ్యజ్ఞానముబుట్టించి ఆదుఃఖములనుండి తన్నుద్ధరించునదివిజ్ఞా
నముకనుక అట్టినిత్యానిత్యవస్తు విభాగజ్ఞానము కలుగుటయే పుత్రుడు
కలుగుట ॥ ఆవస్తుజ్ఞానములేకపోవుటయె పుత్రుడులేకపోవుట॥ కాబట్టి
ఓయిసుగుణశాలీ ఈపుత్రాదిసర్వదుఃఖముల విచారించి॥ పటాపంచల
జేసి ఆత్మస్వరూపుడైన తనయందేప్రీతియుంచి నిష్ఠగలవాడవై చిత్తవి
శ్రాంతిగలిగి సమస్తవాసనారహితుడై యుండవలయునని వేదాంత
సిద్ధాంతము జ్ఞానవైరాగ్యములే ముఖ్యకారణములనుటయందు ॥ శృతి॥
నకర్మణానప్రజయాధనేన త్యాగేనైకేమృతత్వమానసః ॥ అని ॥ ఉప
నిషత్తు ॥ జ్ఞానాదేవతుకైవల్యం ॥ యనిశ్రుతియు॥ పాకస్యవహ్నివత్
జ్ఞానం వినామోక్షోనసిధ్యతి ॥ అని ఆత్మబోధప్రకాశికయందును॥శ్లో॥
నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే ॥ అనిభగవద్గీత॥ శ్లో ॥ నకర్మ
ణామనుష్ఠానైర్నదానైతపసాపివా । కైవల్యంలభతేమర్త్యా । కింతు
జ్ఞానేనకేవలం ॥ అనిశివగీత॥కాబట్టి ఓయిశిష్యా ఈజ్ఞానవైరాగ్యముల
ను పురుషప్రయత్నముచేత పొందుమాయన శిష్యుండిట్లనియె స్వామీ
అయితేప్రారబ్ధకర్మచేతనే జీవన్ముక్తికలిగించుచుండగా పురుషప్రయ
త్నముతోటి ప్రయోజనములేదుగదాయని శంకించగా ఈలాగునశంకిం
చదగదు యిట్లు శంకజేసిన ప్రారబ్ధముచేతనే ధనపుత్రాదిలాభముక
లుగుచుండగా కృషివాణిజ్యాద పురషప్రయత్నముతోటి ప్రయోజనము
లేకపోవునుగనుక ప్రారబ్ధము ధనాదిఫలముల నిచ్చేసమయములో కృషి
వాణిజ్యాదపురషయత్నమును ద్వారముగానుంచుకొని యిచ్చినట్లు జీ
వన్ముక్తియిచ్చేసమయములో యోగాభ్యాసములనె పురుషప్రయత్న
ములను ద్వారముగానుంచుకొనియిచ్చును కాబట్టి వాస్తవమునకు జీ
వన్ముక్తి ప్రారబ్ధకర్మఫలమేగాదు యోగాభ్యాసముయొక్కఫలము
తత్వజ్ఞానమునకంటే ప్రారబ్ధకర్మఏ ప్రకారము ప్రబలమో ఆప్రకా
రము ప్రారబ్ధకర్మకంటే యోగాభ్యాసముహెచ్చుగనుక యోగాభ్యా
సముచేత చిత్తవికారములు నిరోధింపబడును. గనుకనే యోగాభ్యాస

పరులకువీతహవ్యుడు ఉద్దాలకాది మహాఋషులు స్వేచ్ఛగా దేహత్యాగముచేసినట్లు ఇతిహాసములయందు చెప్పబడియున్నది అల్పఆయుష్యులమైన మనకు ఆమహాయోగముసంభవించకపోయినా కామక్రోధాది చిత్తవృత్తులనుమాత్రము నిరోధించుయోగము సులభముగానే సంభవించును శాస్త్రమందుచెప్పియున్న పురుషప్రయత్నమునకు ప్రారబ్ధముకంటే వున్నతత్వమును ఒప్పుకొనినయెడల వైద్యశాస్త్రముమొదలు వేదాంతశాస్త్రమువరకూ సర్వశాస్త్రములు నిష్ప్రయోజనములని చెప్పవలసియుండును ఈశాస్త్రములన్నియు ప్రారబ్ధకర్మఫలములగు రోగాదులకు నివర్తకములైన ఔషధసేవాది పురుషప్రయత్నములను విధించుచున్నవిగదా ఒకానొకపురుషప్రయత్నమునకు కొన్ని దేశకాలములయందు ప్రయోజనము కనుపడకపోయినమాత్రాన అన్నిపురుషప్రయత్నములకు యెన్నడునూ ప్రయోజనములేదని చెప్పగిట్టదు యెట్లన ఒకానొకరాజుయొక్క సైన్యము యుద్ధమందు వాడిన సకలమైనరాజులు సేననుసంపాదించుటయందు ప్రీతిలేనివారైయుండరుగదా ఒక వైద్యుని యొకరోగికి బాగుచేయలేదని ఆవైద్యుని అందరూపిలువకుందురా కాబట్టి ఓయిశిష్యా ఈవిషయమందు ఆనందబోధాచార్యులు వారుచెప్పియున్నారు॥

శ్లో॥ నహ్యాజీర్ణభయా దాహారపరిత్యాగః॥ భిక్షుక భయా
ద్స్థాల్యానధిశ్రయణం । యూకాభయా ద్వస్త్రా
వరణ పరిత్యాగః । అని చెప్పిరి॥

తా॥ ఒకప్పుడు భోజనముచేయగా నజీర్ణము చేసెననియెప్పటికి భోజనము మానేదిలేదు ఒకవేళ బిక్షుకులు యెక్కువగా వచ్చిరనే భీతిచే నిత్యము అన్నమును వండుటకు పాత్రను పొయిమీదపెట్టుట మానేదిలేదు ఒకప్పుడు చీరపేలు పట్టెనభీతిచే నెప్పటికి పైవుత్తరీయము ధరించుట మానెదలేదని యర్థముగనుక పురుషప్రయత్నమగు యోగాభ్యాసముచేత జీవన్ముక్తి సంభవించునని సిద్ధము శాస్త్రోక్తమగు పురుష ప్రయత్నము ప్రారబ్ధముకంటే విశేషమని వాసిష్ఠరామాయణమం

దు వసిష్ఠ రామసంవాద వాక్యములవలన విస్పష్టముగాచెప్పబడెను అవి యెట్లులనిన॥

శ్లో॥ సర్వమేవే వహిసదా సంసారే రఘు నందనా ।
సమ్యక్ ప్రయుక్తాత్ సర్వేణ పౌరుషాత్సమవాప్యతే॥

తా॥ ఓరామా యీసంసారమునందు పుత్రులు ధనము స్వర్గలోకము బ్రహ్మలోకము మొదలగుఫలములు కృషివాణిజ్యములుజ్యోతిష్టోమాదియాగములు బ్రహ్మోపాసనము మొదలగుఫలములెల్లనూబృథముగుప్రియత్నముచేత నిశ్చయముగాలభించును॥

శ్లో॥ ఉచ్ఛాస్త్రంచాశ్త్రితంచేతి పౌరుషంద్వివిదంస్మృతం।
తత్రోచ్ఛాస్త్రమనర్థాయపరమార్థాయశాస్త్రితం॥

తా॥ పురుషప్రయత్నము శాస్త్రీయమని అశాస్త్రీయమని రెండువిధములు పరద్రవ్యాపహార పరస్త్రీగమన సురాపానాదులు అశాస్త్రీయపురుషప్రయత్నము॥

స్నానసంధ్యాద్యనుష్టాన ఈశ్వరప్రణిదానాదులు శాస్త్రీయపురుషప్రయత్నము యిందులో నశాస్త్రీయపురుషప్రయత్నము నరకమునకుకారణము శాస్త్రీయపురుషప్రయత్నము స్వర్గాదిపురుషార్థములకంటే నుత్తమమగు మోక్షమునకు కారణము కాబట్టి ఓయిశిష్యా నీచేనభ్యసించబడిన వేదాంతశాస్త్రాభ్యాస సత్పురుష సహవాసములు మొదలగు గుణములతోగూడిన పురుషప్రయత్నముచేత ఆమోక్షము సాధింపబడునని గురుమూర్తిచెప్పగా శిష్యుండడుగుచున్నాడు ఓస్వామీ నేను పూర్వజన్మలయందు చేశినపుణ్యపాపములయొక్క సంస్కారములనే వాసనలు నామనస్సునందుండి నన్నుయేప్రకారముగా ప్రేరణచేయునో ఆప్రకారముచేయువాడనేగాని అస్వతంత్రుడైన నేనేమిచేయగలనని శిష్యుడుపలుకగా ఓయిశిష్యా మంచిశంకజేసితివి యిందుకు శ్రీరాముండేట్లడుగ వసిష్టమహాముని ఉత్తరమునుచెప్పచున్నారు॥

శ్లో॥ అతఏవహి హేరామా శ్రేయప్రాప్నోషిశాస్వతం ।
స్వప్రయత్నోపనీతేనపౌరుషేణైవనాన్యథా॥ *

తా॥ ఓ రామా యెందువలన నీవువాసనలకు పరతంత్రుడవై యుంటివో అందువలననే కరణత్రయముచేత నుత్సాహముతో జేయు ప్రయత్నమువలన పారతంత్ర్యమును తప్పించుకొని శాశ్వతమైన మోక్షమును పొందగలవు మరియొకమార్గముచేత మోక్షము నుపొందజాలవు॥ ఓపరమగురో ॥ ఏ ॥ వాసనలెటువంటివో వాటివలన నేనేమేగుణములు గల్గునో ఆగుణములనెట్లు పరిహారము జేయవలయునో నాయందు పరిపూర్ణ కరుణారసముంచి యివన్నియు దెలుపవేయునిన శ్రీగురుం డిట్లనియె॥

ఓయిశిష్యా వాసిష్ఠ రామాయణమందు రామునకు వసిష్ఠగురునిచే చెప్పబడియెను॥

వాసనవిరూపణము.

శ్లో॥ ద్వివిధో వాసనావ్యూహో శుభశ్చైవా శుభశ్చతే।
ప్రాక్తనో విద్యతేరామ ద్వయోరకతరోభవ॥ *

తా॥ ఓరామా పూర్వజన్మ సిద్ధములైన వాసనలు పుణ్యవాసనలని పాపవాసనలని రెండు నీకుకలవు. అందులో రెండువాసనలు నిన్ను ప్రేరణ చేయుచున్నవా? నొక పథమైన వాసనలు ప్రేరణచేయుచున్న పక్షమందు పుణ్యవాసనలా లేక పాపవాసనలా నీకు ప్రేరణచేయుచున్నవి॥

శ్లో॥ వాసనౌఘేన శుద్ధేన తత్రచే దపనీయసే ।
తత్క్రమేణ శుతేనైవ పదంప్రాప్స్యసి శాశ్వతం॥

తా ॥ ఈపక్షములు మూటిలో పుణ్యవాసనలు నిన్ను ప్రేరణ చేయుచున్న పక్షమందు అపుణ్యవాసనలచేత చేయించబడే అనుష్ఠాన ప్రయత్నముచేతనే బ్రహ్మపదమును పొందగలవు॥

శ్లో॥ అథచేద శుభోభావ త్వాంయోజ యతిసంకటే ।
ప్రాక్తన స్తదసౌయత్నా జ్జేతవ్యో భవతాస్వయం॥

తా॥ లేక పాపవాసనలు నిన్ను ప్రేరణచేయుపక్షమందు ఆ పూర్వజన్మ సిద్ధములైన పాపవాసనలను శాస్త్రమందు చెప్పిన సత్కర్మానుష్ఠానాది ప్రయత్నములచేత నీవు నశింపజేయుము॥

శ్లో॥ శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతి వాసనాసరిత్।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభేపథి॥ ❊

తా॥ పుణ్యపాప వాసనలు రెండు నిన్ను ప్రేరణచేయుచున్న పక్షమందు పుణ్యవాసనల నాప్రకారమేనిలపి పాపవాసనలను శాస్త్రోక్త సత్కర్మానుష్ఠాన సత్పురుషుల సహవాసాది ప్రయత్నముచేతనశింపచేసి పుణ్యవాసనలనే వృద్ధిపరచ వలయును॥

శ్లో॥ అశుభేషు సమావిష్టం శుభేష్వే వావతారయేత్।
స్వమనః పురుషార్థేన బలేన బలినాంవరా॥ ❊

తా॥ నీమనస్సు పరస్త్రీ పరద్రవ్యాభిలాష మొదలగు పాపములయందు చేరియుండెనా సచ్ఛాస్త్ర శ్రవణ దేవతా ధ్యానాది పుణ్యములయందు ప్రయత్నములచేత చేర్చవలయునని చెప్పియున్నారు. కాబట్టి ఓయిశిష్యా లోకములో నొకబాలుడు మట్టితినుచుండగా పండు తినడమును నేర్పి మట్టనితినుట ఏప్రకారము మాన్పవచ్చునో అటువలె నీచిత్తము పాపహేతువగు దుష్టసహవాసాదుల నాచరించుచుండగా సత్సహవాస సచ్ఛాస్త్ర శ్రవణాది పుణ్యకర్మలనేర్పి పాపములనుండి నీమనస్సును మరలింపవచ్చును. గనుక పురుషప్రయత్నమువలన చిత్తమును బలాత్కారముగా పాపములనుంచి మరలింపవలయును. యిందుకు మరియొక దృష్టాంతమును చెప్పెదవినుము. లోకమందు చపలమగు పశువును కట్టుమట్టుకు జేర్చుటకు రెండు వుపాయములు గలవు. ఒకటి మంచి పచ్చిగడ్డిని జూపుట రెండవది కఱ్ఱయెత్తి బెదరించుట యిందులో మొదటి వుపాయముచేత శీఘ్రముగా కట్టుచోటికి పశువు చేర్చబడును. రెండవ వుపాయముచేతనో అటూ ఇటూ బరువులిడి నెమ్మదిగా చేర్చబడును. యీప్రకారమే చిత్తమును శాంతినొందించుటకును రెండు

వుపాయములు. ఒకటి కామక్రోధములయందు సమబుద్ధిని బోధించుట. రెండవది ప్రాణాయామ ప్రత్యాహారాది హఠయోగము.

ఇందులో మొదటి వుపాయముచేత చిత్తమును శీఘ్రముగా శాంతి నొందించవలయును. రెండవదియగు హఠయోగముచేత శీఘ్రముగా శాంతినొందించ తగదు. కాబట్టి మృదువగు వుపాయముచేతచిత్తమందు పుణ్యవాసనలు బుట్టెనేని తన ప్రయత్నము సఫలమైనదని తలచవలయును. స్వల్పకాలమునకే యిటువంటి పుణ్యవాసనలు కలిగెనాయని సంశయించగూడదు. ఒకవేళ పుణ్యవాసనలు సంపూర్ణముగాబుట్టెనా లేదాయను సంశయము కలిగినపుడు తిరిగి పుణ్యవాసనలకు సాధనములగు నుపాయములను విడువక యభ్యసింపవలయును. అధిక ప్రయత్నముచేయుటవలన హానిలేదు. ఇట్లభ్యాస మేలచేయవలయుననిన. ఓయిశిష్యా నీవుపరమాత్మ స్వరూపమును యెరుగనందున నాపరమాత్మ స్వరూపమందు చేరని చిత్తవృత్తిగలవాడవై యెంతవరకు నుందువో నంతవరకు సద్గురూపదేశముచేత సచ్ఛాస్త్ర పరిశీలనముచేత పరమాత్మ తత్వమును విచారించుచుండుము. అందువలననీకు భగవత్ భక్తత్వము అతివర్ణాశ్రమము కలుగుననిన ఓపరమగురో ఆభగవద్భక్తుని నడవళ్లనుఅభక్తియుకరుణించి దెలుపవేయన శ్రీగురుండిట్లనియె॥

## భక్తి ప్రకరణము.

ఓంమిత్యేకాక్షరం బ్రహ్మ ॥ ఓమితిబ్రహ్మ ॥ ఈప్రణవమే బ్రహ్మమని శ్రుతులు జెప్పును॥ ఈ ॥ ఓంకారము అకార ఉకార మకారములుచేరి ఓంకారమాయెను॥

ఓయిశిష్యా ఈమూడు మాత్రలయందు అకారమున కర్థమేమనిన॥ అకారమనగా వ్యష్టి సమష్టి స్థూలదేహములు వ్యష్టి సమష్టిజాగ్రదవస్థలు వ్యష్టి సమష్టి దేహావస్థాభిమానులైన విశ్వుడు విరాట్టుఈఓంకారముయొక్క అవిద్యాపాదమగు అకారముయొక్క అర్థమగును. ఉకారమనగా వ్యష్టి సమష్టులయొక్క సూక్ష్మశరీరములును ఉభయ శరీరములయొక్క స్వప్నావస్థలును ఆదేహావస్థాభిమానులైన తైజసహి

రణ్య గర్భులను ప్రణవముయొక్క విద్యాపాదాత్మికమగు ఉకారము యొక్క అర్థమగును॥

ఈ మకారముయొక్క అర్థమేమనిన ॥ వ్యష్టి సమష్టులయొక్క కారణ శరీరములున్ను సుషుప్త్యావస్థలున్ను ప్రాజ్ఞసర్వేశ్వరులున్ను ఓంకారముయొక్క ఆనందపాదమగు॥ మకారముయొక్క అర్థము॥ కాబట్టి ఓయిశిష్యా ఈమూడు పాదములును వాచ్యార్థములు ఈఅవిద్యా విద్యా ఆనందపాదములు మూడును వాచ్యార్థమైన మాయాప్రపంచంబు గనుక ఎల్లప్పుడు సర్వవ్యాపకమై శాశ్వతమై జ్ఞానస్వరూపమై ఆనంద స్వరూపమైనఅత్మ తత్వమే తురీయావస్థయగు బ్రహ్మస్వరూపముకాబట్టి ఈఓంకారోపాసనము చేయుటయే సగుణబ్రహ్మోపాసనమని ప్రశ్నోప నిషత్తులో చెప్పబడెను. యిదియునుంగాక॥

శ్రుతి ॥ సర్వంఖల్విదంబ్రహ్మ॥ పురుషాన్న పరంకించిత్॥ పురుష యేవేదగుం- సర్వం- ఏకోదేవ బహుధానివిష్టః- ఏకంసాంతంబహుధా కల్పయంతి- అజాయమానో బహుధా విజాయతే తస్యధీరాపరిజానం తియోనిం- బ్రహ్మవేద బ్రహ్మైవభవతి - సబ్రహ్మస్సశివస్స హరిః సేంద్రసోక్షరః పరమస్స్వరాట్ - అని యుపనిషత్తులు ఘోషించుచుండును యీ ఓంకారార్థాను భవముగలిగి పదియారవ కలయగు తుర్య తురీయస్వరూపుడై యానందించువాడే భగవద్భక్తుడని చెప్పబడు ననిన. ఈ ఓంకారమును కరుణాసముద్రుండవగు ఓగురురాయ యెట్లుధ్యానించవలెనో దయజేసి చెప్పవేయన గురుండిట్లని చెప్పందొడంగె॥

శ్లో॥ తచ్చింతనంతత్కధనం మన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసంవిదుర్బుధాః॥ ✻

తా॥ ఓయిశిష్యాఆప్రత్యగ్బ్రహ్మస్వరూపము యొక్క చింతనంబును అబ్రహ్మస్వరూప విషయసంభాషణంబును గురుశిష్యాది సంవాద ద్వార ఆబ్రహ్మస్వరూపబోధనంబును ఈప్రత్యగాత్మ యందు ముఖ్యమైన

పరతత్త్వబుద్ధియు బ్రహ్మాభ్యాసముగా బుధులెరింగిరని శ్రీవిద్యారణ్యస్వాములు చెప్పియున్నారు కాబట్టి॥

శ్లో॥ తమేవధీరోవిజ్ఞాయప్రజ్ఞాం కుర్వీతబ్రాహ్మణః । నాను
ధ్యాయబహూఞ్ఛబ్దాన్వాచోవిఘ్నాలపనంహితత్॥

తా॥ బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుండగు ముముక్షువు ఆప్రత్యగ్రూపపరమాత్మనే ఎరిగి బ్రహ్మాత్మైక్యత్వజ్ఞానసంతానరూప చిత్తైకాగ్ర్యమునుసంపాదించవలెనుగాని ప్రపంచసమ్మంధమైన శబ్దములను ధ్యానించుటచేత మనస్సునకు శ్రమగలుగుననియు అట్టిశబ్దోచ్చారణమువలన వాక్కునకు శ్రమగలుగునని చెప్పియున్నారు కాబట్టి యిప్పుడు పరమాత్మునియొక్కస్వరూపము దెలిసెనాలేదాయనిన స్వామీ నాకు ఆ పరబ్రహ్మస్వరూపము విస్పష్టముగా దెలియజేయుమనిన శ్రీగురుండు మందహాసంబుతోనిట్లనియె॥

ఓయిశిష్యా పురాణంబులయందును ఈపరబ్రహ్మము చెప్పబడియున్నది॥

శ్లో॥ వృత్తేస్సాక్షితయావృత్తి ప్రాగభావస్యచస్థితిః । బుభు
త్సాయాస్తథాజ్ఞోస్మి త్యాభాతాజ్ఞానవస్తునః॥ ❊

తా॥ కామాదివృత్తి ఉదయించుచుండగా ఆవృత్తికిసాక్షిత్వము చేతను ఆకామాదివృత్తి ఉదయించుటకుముందు, ఆవృత్తియొక్కప్రాగభావమునకు సాక్షిత్వముచేతను, మరియు, జిజ్ఞాసకలుగుండగా, ఆ జిజ్ఞాసకు సాక్షిత్వముచేతను, అంతకుపూర్వమెరుగనివాడనైతినని, యనుభవింపబడుచుండెడి, అజ్ఞానమునకు, సాక్షిత్వముచేతను, ఈప్రకారముగా, జ్ఞానస్వరూపమగు, పరబ్రహ్మమనకుంతటను, స్థితిగలిగి యున్నది॥ మరియును॥

శ్లో॥ అసత్యాలంబనత్వేన సత్యసర్వజడస్యతు।
సాధకత్వేనచిద్రూప సదాప్రేమాస్పదత్వతః॥

తా॥ మరియు ఆపత్యగాత్మయనెడి పరబ్రహ్మము అసత్యమగు సర్వజగంబునకు అధిష్ఠానత్వముగానుండుటచే సత్యస్వరూపుడగును మ

రియు సర్వజడపదార్థరాశిని ప్రకాసింపజేయుటవలన సాధకుడగుట చేత చిద్రూపుడగును సర్వదాప్రేమవిషయుడగుటవలన ఆనందరూపుడగునని సూతసంహిత మొదలగు పురాణములయందు జీవేశ్వరత్వాదికల్పనారహితుడైనట్టియు అద్వితీయుడయినట్టియు స్వప్రకాశచైతన్యరూపుడైనట్టియు సర్వదాశోభాయమానుడైనట్టి ఆపరబ్రహ్మమును దెలిసితివాయనిన విని శిష్యుండు పులకాంకితశరీరుండై యానందభాష్పంబులురాల శ్రీగురుండే భవతారకుండైన శ్రీమన్నారాయణుండని ప్రదక్షిణనమస్కారములంజేసి శ్రీగురురాయా నేధన్యుడనైతి। నాభవబంధంబులువీడెనని ప్రణుతిజేసి స్వామీ మీకరుణచే భక్తియోగంబుదెలిసెనిక భగవద్భక్తశబ్దముచేత వర్ణింపబడు యాభక్తుండు నెట్లునటించునో యేమిజేయునో వారిగుణంబులన్నియు కరుణించి తెలియజేయువేయనిన శ్రీగురుండు ఓయిశిష్యా నిశ్చలచిత్తుండవై వినుమనియిట్లుజెప్పందొడంగెను॥

ఈజీవన్ముక్తుడు భగవత్గీతాద్వాదశాధ్యాయమందు భగవత్భక్తశబ్దముచేత వ్యవహరింపబడియున్నాడు. అదియెటువలెనంటే॥

శ్లో॥ అద్వేష్టాసర్వభూతానాం మైత్రీకరుణఏవచ । నిర్మ
మోనిరహంకార సమదుఃఖస్సుఖక్షమి । సంతుష్టం
సతతంయోగి యతాత్మాదృఢనిశ్చయః । మైయర్పిత
మనోబుద్ధిః యోమద్భక్తసమేప్రియః॥ ✻

తా॥ సమస్తభూతములయందూ ద్వేషములేనివాడును అన్నిభూతములను స్నేహితులుగాభావించువాడును యేభూతమునకైనా ప్రారబ్ధకర్మచేత దుఃఖముప్రాప్తించినప్పుడు ఆదుఃఖమునుజూచి సహించలేని మృదువైనచిత్తముగలవాడును భార్యాపుత్రగృహక్షేత్రాదులయందు మమకారములేనివాడును దేహేంద్రియాదులయందహంకారములేనివాడును చిత్తైకాగ్ర్యముగలిగి పరమేశ్వరార్పితచిత్తవృత్తిగలవాడౌటచేత హర్షవిషాదములు లేకపోవుటచేత సుఖదుఃఖములయందు సమత్వబుద్ధిగలవాడును శీతోష్ణాదిద్వంద్వములను సహించేస్వభావము

గలవాడును సర్వకాలములయందూ సర్వకామప్రాప్తిగలవానివలె యానందభరితుడైయుండువాడును చిత్తమును విషయములయందు ప్రవేశించకుండాచేయువాడును కుటిలయుక్తులచేత నిరాకరింపతగని దృఢమైన బ్రహ్మజ్ఞానముగలవాడును పరమేశ్వరునియందు చేర్చినమనోబుద్ధులుగలవాడును భగవద్భక్తుడనబడును॥

శ్లో॥ యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతేచయః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తోయస్సచమేప్రియః॥ *

తా॥ సర్వభూతముల కభయమునిచ్చి పరమహంసాశ్రమమంగీకరించినందున ఎవనివల్ల సర్వభూతములకూ భయములేదో నిష్కారణముగా దుష్టజనులవలన యెవడు పరమాత్మజ్ఞానముగలవాడగుటచే భయమునొందడో ప్రియవస్తువుయొక్క లాభమునందు సంతోషములేనివాడును యెదటివారియొక్క సంవృద్ధిని చూచిసహించలేని స్వభావములేనివాడును సర్పవ్యాఘ్రాదిజంతువులవల్ల భయములేనివాడును విజనస్థలమందు నేనుఒంటరిగా యెట్లునివసించగలననే బుద్ధిలేనివాడును యేపురుషుడో అతనుభగవద్భక్తుడనబడును॥

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనోగతవ్యథః । సర్వా
రంభపరిత్యాగీ యోమద్భక్తస్సమేప్రియః॥ *

తా॥ అప్రయత్నముగా లభించిన భోగసాధనములయందు కోరికలేనివాడును బాహ్యాభ్యంతరశౌచముగలవాడును తెలుసుకోదగిన కార్యములను తెలుసుకోవడమునకు చేయడమునకు సామర్థ్యముగలవాడును తనశత్రుడు మిత్రుడు వివాదమునుబొందుచుండ తాను యేపక్షమును అవలంబించకయుండువాడును సుఖప్రాప్తియందును చిత్తవైకల్యము లేనివాడును ఇహలోక స్వర్గలోకఫలములుగల సర్వకర్మలను విడచినపురుషుడు భగవద్భక్తుడనబడును॥

శ్లో॥ యోనహృష్యతినద్వేష్టి నశోచతినకాంక్షతి । శుభా
శుభపరిత్యాగీ భక్తిమాన్యస్సమేప్రియః॥ *

తా॥ యిష్టవస్తుప్రాప్తియందు సంతోషమును అనిష్టప్రాప్తి యందు కోపమునులభించిన ప్రియవస్తువులయొక్క నాశమునందు దుఃఖమును లేనటువంటి ప్రియవస్తువులయందు ఆశయును లేనివాడును సుఖదుఃఖములకు సాధనములగు శుభాశుభకర్మలనన్నిటిని సవాసనగా పరిత్యజించు స్వభావముకలవాడు భగవద్భక్తుడనబడును కాబట్టి ఓయి శిష్యా నీవు పరబ్రహ్మజ్ఞానముగలవాడవైనను నీచిత్తము విశ్రాంతిని గోరుచున్నదిగాబట్టి యీపైనచెప్పబడిన శ్రీకృష్ణభగవానులచే బోధింపబడిన చిత్తవిశ్రాంతిమార్గమును నీవుకూడా అభ్యాసముచేసి మెల్లమెల్లన నీచిత్తమును విశ్రాంతి నొందింపుమనిన శిష్యుండిట్లనియె. ఓపరమగురో అతివర్ణాశ్రమ మన నెటువంటివో దెలుపుమన శ్రీగురుండు కరుణారసభరితుండై యిట్లుజెప్పందొడంగె॥

వర్ణాశ్రమప్రకరణం.

నిరాలంబోపనిషత్తు ॥ జాతిరితీచః । నరక్తస్య । నమాంసస్య । నస్థూలశరీరస్య । నానాజాతస్య కళాలోహ । కల్పనీయః ॥ అనిచెప్పియున్నది ॥ గనుక జాతులు కల్పనలని యెరుంగునది ॥ ఓయిశిష్యా సత్వగుణము రజోగుణము తమోగుణము ననునీ త్రిగుణములయొక్క అల్పత్వాధికత్వములచేతనేగాని వేరుగాదు॥

ఇందుకు ప్రమాణము ॥ ౧౮ - అ ॥ ౪౧ - వ॥ శ్లో ॥

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతపః ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥

తా॥ అని శ్రీకృష్ణ భగవానులు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వ్యాపారములు స్వభావసిద్ధములైన గుణములచేతనే భాగింప బడెనని యుపదేశించి యున్నారు॥ యనిన॥

ఓస్వామీ వర్ణంబు లెటువలె కల్పితము లాయెనో స్త్రీలకు శూద్రులకు మంత్రాధికారంబు లేదనియు నెన్నిసాధనములు చేసినా శూద్రత్వమునకు నివృత్తిలేదనియు ముఖమందుబుట్టినవారు బ్రాహ్మణులనియు భుజములందుపుట్టినవారు క్షత్రియులనియు తొడలయందుబుట్టిన

వారు వైశ్యులనియు పాదములంబుట్టినవారు శూద్రులనియు మంత్రాధికారులే బ్రాహ్మణులని చెప్పటచే నితరవర్ణంబులకు మోక్షములేదని పుట్టెడు సంశయమును నివర్తిచేయు దేవరవారేకర్తలని వేడుకొనిన శిష్యునిసంశయము నివర్తిచేయందలంచి గురుండిట్లనియె॥

ముఖమున బుట్టినవారే బ్రాహ్మణులనిన బ్రాహ్మణులకు నాదిపురుషుడగు బ్రహ్మ శ్రీహరినాభియందు బుట్టినటుల సర్వశాస్త్రములయందు జెప్పుటజేసి బ్రహ్మకు బ్రాహ్మణత్వము లేకపోవుచున్నది. ఇదియునుంగాక శ్రీహరిపాదములందు బుట్టినగంగ జగత్తునుపావనముజేయుచు సర్వదేవతాభిషేకములకు మూలమై జగత్పూజ్యమైన గంగకును శూద్రత్వము సంభవింపుచున్నది. ఇందుకు భాగవతముత్పత్తియనగ్రంథములో

సీ॥ అరవింద సంభవు నంగుష్టమునదక్షు దూరువువలనను నారదుండు॥ యనిచెప్పియున్నది గనుక దక్షబ్రహ్మకున్ను శూద్రత్వముసంభవించుగాన ఇటులనగూడదు. అన్నట్లాయెనా ముఖమందుబుట్టినబ్రాహ్మణులొకరును లేరు. ఓ ఋషిపుత్ర క్షత్రియులు భుజములందు పుట్టిరంటివా క్షత్రియులందు సూర్యవంశమనియు చంద్రవంశమనియు రెండువంశములు లోకప్రసిద్ధములు సూర్యవంశమున కాదిసూర్యుడు కశ్యపబ్రహ్మకు బుట్టినటులశాస్త్రములయందు జెప్పబడుచున్నది. చంద్రుడు అత్రిమహాఋషికిబుట్టినటుల శాస్త్రముల జెప్పియున్నదిగాని భుజములందు బుట్టినటుల జెప్పలేదుగాన వీరిద్దరు క్షత్రియులు కాకపోదురు॥

శ్రుతి॥ బ్రాహ్మణోస్య ముఖమాసీత్॥ అనుశ్రుతులకర్థంబెట్లనిన॥

శ్రుతి॥ విశ్వం నారాయణం దేవ॥ మనగా భగవంతుడు విరాట్పురుషుడౌటచే ప్రపంచమే శరీరమాయెను. శరీరమునకు ముఖము ప్రధానమవుటచే నుత్తమమనియు భుజములు మధ్యములనియు తొడలు అధమములనియు పాదములు అధమాధమములనియు అందువలన ఈభగవత్ సృష్టిలో జనులందు శాంతి శమదమాది వివేకముగలిగి బ్రహ్మనిష్టగలవారుత్తములనియు అందు కనిష్టవివేకులు మధ్యములనియు అందు కొరతవివేకులు అధములనియు కేవల వివేకహీనులు శూద్రులనియు

చెప్పంబడెను. ఓయిశిష్యా ఈనాల్గువర్ణంబులు ఈశ్వరునకు నాల్గు నవయవములుగా విభజించిరి. అదెట్లనిన॥

శ్రుతి ॥ చంద్రమా మనసోజాతః చక్షోస్సూర్యఅజాయత। అని చంద్రుడు మనస్సున నేత్రముల సూర్యుడు బుట్టిరని యర్థముజేయునట్లైతే చంద్రుడు అత్రి కొమారుడనియు సూర్యుడు కశ్యపునకు బుట్టినటుల మెరుగునటుల బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు పుట్టిరనియన్న నటువలె యర్థముచేయరాదు॥

శ్లో॥ బ్రాహ్మణో భగవాన్రుద్రో క్షత్రియః పరమోహరి।
వైశ్యఃపితా మహశ్చైవ ఇంద్రశూద్రశ్చ జాయతే। ॥

తా॥ అని ఇంద్రునకు శూద్రత్వము చెప్పుచున్నది. ఇటువలె నర్థముచేసినట్లాయెనా ఇట్టి శూద్రభోగ్యంబైన స్వర్గాదులకై బ్రాహ్మణులుజేయు యజ్ఞ యాగాది క్రతువులకు దోషము కల్గుచున్నది బ్రాహ్మణులకును శూద్రత్వము కల్గుచున్నది. కాబట్టి ఇట్లు అర్థముచ్చేయరాదు. బ్రాహ్మణ శూద్రులనగా జ్ఞానాజ్ఞానములు కాబట్టి ఓయిశిష్యా ఈ పండిత పామరులు నిజమైన యర్థముదెలియక అభిమానము గలవారలై నరకకూపములందు గూలుచుందురు. కాబట్టి ఓయిశిష్యా బ్రాహ్మణశబ్ధమునకు సత్యమైన యర్థము చెప్పుచున్నాముగాన సావధాన చిత్తముగలవాడవై వినుమని యిట్లు జెప్పందొడగె॥

వజ్రసూచోపనిషత్తు.

యః । కశ్చిదాత్మాన । మద్వితీయం । జాతిగుణక్రియా
ద్విహీనం । షడూర్మి షడ్భావేత్యాది సర్వదోష రహి
తం । సత్యజ్ఞానా నందానంత స్వరూపం । స్వయం ।
నిర్వికల్ప । మశేషకల్పాధార । మశేషభూతాంతర్యా
మిత్వేన । వర్తమాన । మంతర్బహి । శ్చాకాశవ । ద
నుస్యూత । మఖండానంద స్వభావ । మప్రమేయ । మ
నుభవైకవేద్య । మపరోక్షతయా । భాసమానం । క
రతలామలకవత్ । సాక్షాదపరోక్షి కృతార్థకృత్వా ।

తయా । కామరోగాది దోషరహిత ! శమాది సంప
న్నో । భావమాత్సర్య । తృష్ణాశా మోహాదిరహితో ।
దంభాహంకారాదిభి । రసం స్పృష్టచేతా । వర్తతే।
ఏవముక్త లక్షణో । యస్సఏవ । బ్రాహ్మణః॥ *

తా ॥ బ్రాహ్మణు డెట్టివాడనిన జాతి సత్వరజస్తమోగుణము లు కర్మములులేనివాడును ఆకలి దప్పి ముదిమిమరణములనెడు షడూర్ము లులేనివాడును పుట్టుట పెరుగుట మారుట చిక్కుట నశించుటయను నారు వికారములు లేనివాడును సత్యజ్ఞానానందములే స్వరూపముగల వాడును అంతము లేనివాడును స్వప్రకాశము గలవాడును మార్పు లేని వాడును సమస్తకల్పములకు నాధారభూతుడును వ్యాష్టిచేత సమస్త క ల్పములకు నాధారభూతుడును వ్యాష్టిచేత సమస్తభూతములకు నాత్మ స్వరూపుడును సమష్టిమీద సమస్తమందు నాకాశమువలె లోపలను వె లుపలను ఏకరీతిగా నెడముగన్పడనీయక వ్యాప్తియుండువాడును కొరవ డని బ్రహ్మానందము గలవాడును మితివెట్టుటకు నలవికానివాడును అను భవముచేత నేతప్ప నింకొక విధమున తెలిసుకొన వీలులేనివాడును ప రోక్షముగాక ప్రత్యక్షముగా వెలుగువాడును అగు పరబ్రహ్మమునుస్ప ష్టముగా ప్రత్యక్షము జేసుకొని ధన్యత్వమును బొందుటచేతను కామము మొదలగు దోషములులేక శమదమాది షడ్గుణ సంపన్నముగలభావము మాత్సర్యము తృష్ణ మోహము మొదలైన దోషములులేక దంభము అ హంకారము దుర్గుణములను చిత్తమున కంటనీయక సంకల్పరహితుడై యద్వితీయుడైయుండు నాతడే బ్రాహ్మణుడు॥

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః ।
వేదపాఠంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥

తా ॥ బ్రహ్మజ్ఞానమును తెలిసినవారే బ్రాహ్మణులు॥

శ్లో॥ అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనంతథా ।
దానంప్రతి గ్రహంచైవ బ్రాహ్మణా నామకల్పయత్॥

తా॥ చదివించుట, చదువుట, యజ్ఞముచేయుట, యజ్ఞముచేయించుట, దానమిచ్చుట, దానముపుచ్చుకొనుటలను, యీ ఆరుకర్మలకు అధికారులు బ్రాహ్మణులు.

౧. చదువుట సర్వకాలసర్వావస్థలయందు, పరబ్రహ్మస్వరూపమందే, మనసును మగ్నతచేసి, విషయములకు పోనీక నిలుపుట.

౨. చదివించుటయనగా తీవ్రమోక్షేచ్ఛగలశిష్యునకు విశదముగా జెప్పి అనుభవమును గలుగజేయుట.

౩. యజ్ఞముచేయుటయనగా.

శ్రుతి, తస్యైవం, విదుషో, యజ్ఞస్యాత్మా య
జమానః, శ్రద్ధా, పత్నీ, శరీర, మిధ్మ
ముదో వేది, ర్లోమానిబర్హి, ర్వేదసిఖా, హృదయం
యూపః, కామఆజ్యం, మన్యుఃపశు, స్తపోగ్నిః,
శమయితాదక్షిణ, వాగ్ఘోతా, ప్రాణఉద్గాతః
చక్షురద్వర్యు, ర్మనోబ్రహ్మా, శ్రోత్రమగ్నిః
న్యావత్ధ్రియతేసా, దీక్షా,

అనితైత్తిరీయమందుచెప్పబడెను.

యజ్ఞమునకుకర్త ఆత్మ
దేవుడుకలడనెడు బుద్ధియేభార్య
శరీరమేసమిత్తు
రోమ్ములుయజ్ఞవేదిక,
వెంట్రుకలు, అనగావృత్తులుదర్భ
శిఖస్వప్రకాశముగావెలిగెడు తెలివియేవేదము
హృదయము, ఏతెలివివల్లనైతె, సమస్తమును, చూస్తున్నామో
వినుచున్నామో, తెలిసికొనుచున్నామో, అట్టితెలివియుం
డెడిస్థానము, యిదియేపశువునకు, కట్టుకొయ్య
సంకల్పము, నెయ్యి,
అహంకారము, పశువు,

తపస్సు, అనగా మనసును, విషయములకు బోనీకనిలిపియుంచుట ఇది యేయగ్ని
శాంతికలుగుట యనగా, అంతరబాహ్యములయందు, సర్వత్రాపరబ్రహ్మ స్వరూపముకంటె, అన్యమేమియులేదనియు, తానును పరబ్రహ్మస్వరూపమనియు, తెలిసికొనుట, ఇదియే యజ్ఞదక్షిణ
వాక్కు, ఋత్విక్కు,
ప్రాణము, ఉద్గాత,
నేత్రము, అధ్వర్యుడు,
మనస్సు, బ్రహ్మ,
శ్రోత్ర, మజ్ఞులు,
యజ్ఞదీక్ష, యనగా, మనసును విషయములకు బోనీయక సంకల్ప వికల్పములు కలుగనీయక, సర్వకాలసర్వా వస్తులయందును, ఆపరబ్రహ్మ స్వరూపమందే, మగ్నతజేశియుండుట.

౪. యజ్ఞమునుచేయించుట, యనగా, తీవ్రమోక్షేచ్ఛగలశిష్యునకు తెలియజెప్పి, తానుదగ్గరవుండి, బ్రహ్మయజ్ఞమునుచేయించి శిష్యునిసమాధానపరచుట.

౫. దానమిచ్చుట, ఒకనికి విద్యనుచెప్పుట-

౬. దానమును తీసికొనుటయన, శిష్యులవద్దనుండి ఎరుకయునెడు, అజ్ఞానమునుతీసికొని, వారిని, పరబ్రహ్మస్వరూపజ్ఞాన, సంపత్తిగలవారినిగాజేయుట.

యిట్లు షట్కర్మాధికారులే బ్రాహ్మణులని చెప్పవలయును. ఈజాతిభేదము, స్థూలశరీరమునకేగాని, త్రిశరీరవిలక్షణుడగు, నాత్మస్వరూపమైన తనకులేదని యెరుంగునది.

శ్రుతి, నశిఖా॥ వపనం, కృత్వా, బహిస్సూత్రం,
త్యజేత్ బుధః, బ్రహ్మసూత్రంమిదంజ్ఞేయం,
సూత్రంనామపరంపదం, తత్సూత్రంధారయే,
ద్యోగి, సవిప్రోవేదపారగః॥ అని బ్రహ్మోపనిషత్తుగనుక॥

పెద్దలుశిఖాధారణము, ముండనము, ముఖ్యములని తలంచక, వెలుపలి యజ్ఞోపవీతధారణము, వ్యర్థమనియు, బ్రహ్మసూత్రధారణమే, ముఖ్యమనియుతలంచెదరు, అట్లుబ్రహ్మసూత్రమునుధరించినవాడే, బ్రాహ్మణుడు, అట్టివానినే బ్రాహ్మణుడనియు, వేదముల, తుదముట్ట, చదివిన,వాడనియు, చెప్పవలయును. ఓ ముశిష్యా, కొంతమంది, శాలువలువేసుకొని, సాంగాధ్యాయనపరులమనితలంచెదరు, అనుభవజ్ఞానములేక,చిలుకలవలెనేర్చుకొని, చిలుకపలుకులవలె, పలుకుటవలన, ప్రయోజనములేదని, ఆమాహానుభావులకు తెలియదుకాబోలు. అట్టివారు, అభిమానమునువిడని, యింతటికైనా, ఆవాక్యములయొక్క యర్థమును,పెద్దలవలన తెలిసికొనుట యుక్తమేగదా,

యిదియునుంగాక, జీవుడు బ్రాహ్మణుడుగాడు, శరీరము బ్రాహ్మణుడుగాదు, జ్ఞానము బ్రాహ్మణుడుకాడు, .

లేడివలనపుట్టిన, ఋష్యశృంగమహాముని, తనబ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణుడనిపించుకొనెను,

దర్భవలనపుట్టిన కౌశికుడు, నక్కవలనపుట్టిన జంబుకమహాఋషి, ఊర్వసివలనపుట్టిన వసిష్ఠమహార్షి, కుండనుంచిపుట్టిన, అగస్త్యమహాముని పుట్టవలనపుట్టినవాల్మీకి, బెస్తవానికూతురికిపుట్టిన, వ్యాసులు వీరందరూ వారివారి బ్రహ్మజ్ఞానముచేత, బ్రాహ్మణులనియు, బ్రహ్మజ్ఞులనియు చెప్పబడిరి కావున, ఆత్మావలోకనముచేయునట్టివాడే, బ్రాహ్మణుండు అనిచెప్పనగును,

శ్రుతి, యదక్షరంపరబ్రహ్మ తత్సూత్రమితిధారయేత్॥

అని బ్రహ్మోపనిషత్తుగనుక, అక్షరమగు పరబ్రహ్మమెద్దియో యదియే యజ్ఞోపవీతమని ధరించవలెను,

మరియు, శ్రుతి, తత్సూత్రంవిదితంయేన, సవిప్రోవేదపారగః, యని బ్రహ్మోపనిషత్తు॥ కాబట్టి యజ్ఞోపవీతమగు, నాసూత్రమును, అపరోక్షజ్ఞాన సాక్షాత్కారస్వానుభవముచేత నెవడు స్పష్టముగా తెలి

సికొనునో, యాబ్రాహ్మణుడె వేదములను, తుదముట్టచదివినవాడగును అట్టివారినే, బ్రాహ్మణులని చెప్పవలయును.

ఓయిశిష్యా ఈయజ్ఞోపవీతముయొక్క వివరమునీకు తెలియదు కావున తెలిపించుచున్నాము. యజ్ఞోపవీతము మూడు సూత్రములు బ్రహ్మముడియుగలది యజ్ఞోపవీతము। ఒక్క సూత్రమునకు మూడు అంతర సూత్రములును। ఒక్క అంతరసూత్రమునకు మూడుపోగులుండును. కావున యజ్ఞోపవీతమునకు ౨౭ పోగులగును॥ కావున

ఓం - అకార । ఉకార - మకారములు- యివియే పెద్దపోగులు.
భూ। ర్భువః। సువః॥ యివిమూడును అంతరసూత్రములు॥
తత్సవితుర్వరేణ్యం...ఇవిమూడును మూడుపాదములు॥
భర్గోదేవస్య ధీమహి...ప్రతియంతర సూత్రమునకును,
ధియోయోనః ప్రచోదయాత్...పోగులుగా నేర్పడును.
వీని సంపుటీకరణమే బ్రహ్మముడి॥ ఇదియే గుణసామ్యావస్థ॥

యజ్ఞోపవీతమందలి మూడుపోగులు ఇడ పింగళసుషుమ్న లనియు బ్రహ్మముడియే త్రికూటస్థానమనియు స్థానమునువదలి సహస్రారమందుండుటయే సన్యాసమనియు తెలిసికొనుము॥

నక్షత్రములు ॥ ౨౭ ॥ న్ను చంద్రుని భార్యలని ప్రతీతి ఈ ౨౭ - నక్షత్రములు. ౨౭ - పోగులనియు బ్రహ్మముడియే చంద్రుడనిన్ని ఈచంద్రునివలననే కామము వృద్ధియనియు కామములేనియెడ మనస్సు వృత్తిరహితమనియు అదియె సన్యాసమని తలంపుము॥

కాబట్టి యిటువంటి బ్రహ్మసూత్రధారులే శాస్త్రములందు జెప్పిన సత్యబ్రాహ్మణులనిన ఓగురురాయా స్త్రీలకు - అధికారముగలదోలేదో కరుణించి దెలుపవేయన॥ బృహదారణ్యము మొదలగు వేదాంతములయందును గార్గిమొదలగు స్త్రీలు సన్యాసినులని బ్రహ్మనిష్ఠలనిన్ని చెప్పియున్నది. గనుకనే యాజ్ఞవల్క్య మహాముని తనభార్యయగు మైత్రేయీదేవికి బ్రహ్మవిద్య నుపదేశించి బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థా

శ్రమములయందుండు ఆశ్రమరూప సన్యాసమును స్వీకరించుటకుకొన్ని కారణములవల్ల ననుకూల్యములేనియెడల తమతమ యాశ్రమ ధర్మముల నాచరించుచు కామనాకర్మ ఫలరహితమనే మానససన్యాసమవలంబించి యే వేదాంతశ్రవణము జేయవచ్చును. శ్రుతిస్మృతేతిహాసముల యందును, లోకమునందును మానస సన్యాసపూర్వకముగా వేదాంతశ్రవణము చేసిన మహానుభావులనేకులు గనుపడుచున్నారుగనుక దండకాషాయాద్యాశ్రమ సన్యాసము లేనివారికి వేదాంతశ్రవణము నందధికారములేదని సందేహముపొందక నిస్సందేహముగా శ్రవణాదుల జేయుచు గురుమూర్తిని చతుర్విధ శుశ్రూషలచే సేవింపుచు భావింపుచు ధ్యానింపుచు ప్రాణ మాన ధనములు గురునకు సమర్పింపవలయును॥

ఓయిశిష్యా ॥ ఈప్రాణ మాన ధనములు స్త్రీలవిషయమై సమర్పింప వలయుననుటలో॥ కొందరు పంచమహాపాతకగురువులు తమ శిష్యులగు స్త్రీలయొక్క సౌందర్యమునకు మోహించి బలవంతముగా శిష్యురాలిని సమ్మతపరచి మానమును గురునకు సమర్పించనియెడల సచ్ఛిష్యురాలవుగావని బోధించెడు మహానీయులు పంచమహాపాతకుల కంటె నధములని నొక్కివక్కాణింపగలము।

ఓయిశిష్యా ఈకారణమువలననే స్త్రీలకు భర్తయేదైవము భర్తయే గురుడు అనిచెప్పబడును కావున ఓయిశిష్యా దుర్మార్గులును వేషధారులును అగు గురువులచెంతజేరక సద్గురువులచెంతజేరి వారియనుగ్రహమును పొందవలయును॥

ఓయిశిష్యా స్త్రీలు అబలలుగనుక గురువులవలన వేదాంతవాక్యములను వినునపుడు పెనిమిటి దగ్గరయుండియే వినవలయును భర్తయింటలేని సమయములయందు శ్రవణముచేయుటగిట్టదు స్త్రీలుస్వతంత్రులుగారుగనుక వారికి ఏకాంతప్రశంసలేదు స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము ఏయామది పెనిమిటిని దైవముగా భావించి పూజించునో అది స్వర్గమునందును దేవతలచేత పూజింపబడును ॥ మహాపతివ్రతలుభూలోకంబునను బూజింపబడుదురు ఈపాతివ్రత్యమువలన వీరలు ఈలోక

మందును స్వర్గలోకమందును సన్మానింపబడుదురేగాని మోక్షములేదు బ్రహ్మజ్ఞానముగల స్త్రీలు అనేకమంది లేకపోయినను అక్కడక్కడ బ్రహ్మవిద్యాధురంధరులు కలరు. వారివారి అనేకజన్మసంపాదనపుణ్యపరిపాకమువలన బ్రహ్మజ్ఞానము అతిసులభముగా తెలియగలదు. స్త్రీలకుజ్ఞానము హెచ్చు ఇందుకు నిదర్శనము చూడాలయను స్త్రీ గనుక మిగులసులభముగా తెలియగలరు. కావున ఓయిశిష్యా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశముల కతీతులును సర్వాశావర్జితులై స్త్రీయోగినులు యేజాతియైనను యేవృత్తియందున్ననుబాలులైనను వృద్ధులైనను పూజనీయులని తెలియదగినది యనిన॥

ఓపరమగురో వాసన లెటువంటివో వానిస్వరూపంబు దెల్పి కడతేర్చెడికర్తలు దేవరవారే యనిన॥

వాసనాప్రకరణము.

ఓయిశిష్యా ఈవాసనయొక్క భేదము వాసిష్ఠ రామాయణమునందు వాల్మీకమహర్షిచే చెప్పబడినది. యెటువలెనంటే॥

శ్లో॥ వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మలినా తథా ।
మలినా జన్మహేతుస్స్యా చ్ఛుద్ధాజన్మ నివారిణీ॥ *

తా॥ వాసనయనేది మలినవాసనయని శుద్ధవాసనయని రెండు విధములు అందులో మలినవాసన జన్మకు కారణముగాను శుద్ధవాసన మోక్షమునకు కారణముగాను చెప్పబడుచున్నవి॥

శ్లో॥ అజ్ఞాన సుఘనాకార ఘనాహంకార శాలినీ ।
పునర్జన్మ కరీప్రోక్తా మలినావాసనా బుధైః॥ *

తా॥ పంచకోశములకు వీటికి సాక్షిఅయిన చిదాత్మకును స్వతఃభేదము కలిగియున్నప్పటికిన్ని భేదము కనుపడకుండా కప్పుకొనునది యిట్టియజ్ఞానమునందు వాసనఘనీభవించును. యిట్టి అజ్ఞానముతోచేరి భ్రమలను కలుగజేయునదియు బలిష్ఠమైన యహంకారముతో గలసియుండునదియు ఉత్తరకాలమునందు జన్మలను కలుగజేయు సామర్థ్యముకలదియు మలినవాసనయని పండితులచే చెప్పబడినది॥

ఓయిశిష్యా అజ్ఞానముతోచేరిన వాసనచేత పుట్టింపబడు భ్రమలను భగవద్గీతలయొక్క పదియారవ యధ్యాయమునందు అసురసంపత్తిని వివరించునెడ శ్రీకృష్ణభగవానులు ఆనతిచ్చియున్నారు॥

మలినవాసననిరూపణము.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనాన విదురాసురాః ।
నశౌచం నాపిచాచారో నసత్యంతేషువిద్యతే ॥

తా॥ మలిన వాసనగల పురుషులు ధర్మకార్యములయందు ప్రవర్తించుటనుగాని యధర్మకార్యములలోనుంచి నివర్తించుటనుగాని యెరుగరు. యేప్రకారము తనబుద్ధికితోచునో నాప్రకారముగాచేయుచుందురు. అంతరబాహ్య శౌచముగాని శ్రుతిస్మృతులయందు చెప్పిన యాచారముగాని యథార్థముగా మాటలాడుటగాని యసురప్రకృతిగల పురుషులయందు వుండనేరదు.

శ్లో॥ అసత్యమ ప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం ।
అపరస్పర సంభూతం కిమన్యత్కామహైతుకం॥ *

తా॥ ఈప్రపంచమునందు శ్రుతిస్మృతేతిహాస పురాణాదులు వాస్తవములున్ను ప్రమాణములున్ను కావనిన్ని ధర్మాధర్మములు లేవనిన్ని యీప్రపంచమును సృష్టించు నీశ్వరుడు సుతరాం లేడనిన్ని స్త్రీపురుష సంయోగముచేత నీప్రపంచ మనాదిగా బుట్టుచున్నదిగాని దీనికివేరుకారణములేదని చెప్పుచుందురు॥

శ్లో॥ ఏతాందృష్టి మవస్టభ్య నష్టాత్మానో ల్పబుద్ధయః ।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥ *

తా॥ ఈప్రకారముగా చార్వాకమతాభిప్రాయమును అనుసరించి కేవలదోషబుద్ధికలవారై కనుపించు పురుషార్థములగు పశ్వన్నగృహక్షేత్రాదులయొక్క సంపాదనమందు ఆసక్తబుద్ధిగలవారై పరులకు హింసకలుగు కార్యములను జేయుచు సర్వజన విరోధులై లోకనాశముకొరకే నీయసురప్రకృతిగలపురుషులు పుట్టుచుందురు.

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః ।
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తంతే శుచివ్రతాః ॥
తా ॥ ఈపురుషులు లోకములోని మణిసువర్ణాది పదార్థములన్నియు లభించినా తృప్తిలేని ఆశగలవారై దంభము అభిమానము మదను వీటితోకూడి అవివేకముచేత పట్టరానిపట్లనుపట్టి సాధించవలయుననే కోరికగలిగి అపరిశుద్ధములైన మద్యమాంసాది ద్రవ్యములను సహాయములుగా జేర్చుకొని సర్వలోక నింద్యమగు వ్రతము నవలంబించి ప్రవర్తించుచుందురు॥

శ్లో॥ చింతా మపరిమేయాంచా ప్రళయాంతా ముపాశ్రితాః ।
కామోపభోగ పరమాః ఏతావ దితి నిశ్చితాః॥ *
తా ॥ ఇదిగాక శరీరము పడువరకు మితిలేనివిచారము కలవారును స్రక్చందన వనితాది భోగముల ననుభవించుటయే పురుషార్థమని తలచువారును మనుష్యులకు పురుషార్థము భోగమేగాని వేరులేదనేనిశ్చయముగలవారై ద్రవ్యమునే సంపాదించుచుందురు॥

శ్లో॥ ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః ।
ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్॥
తా ॥ అనేక దురాపాశములచేత నీడ్వబడుచు కామక్రోధములు నాశ్రయించి కామభోగముల ననుభవించుటకొరకే దొంగతనము జూదము మోసము మొదలగు నన్యాయ వ్యాపారములచే ద్రవ్య మార్జింప తలంచుదురు. ఈప్రకారమే మలిన యహంకారమున్ను చెప్పబడియున్నది॥

శ్లో॥ ఇదమద్య మయాలబ్ధ మిమంప్రాప్స్యే మనోరథం ।
ఇదమస్తీద మపిమే భవిష్యతి పునర్ధనం॥ *
తా ॥ ఇట్టి యాసురసంపదగల పురుషులు యీప్రకారముగా తలంచుచుందురు. నామనస్సునకు సమ్మతమైన నీవిషయమును నిప్పుడుపొందినాను, యింకొక విషయమునుకూడా పొందగలను, యింతధనమిప్పటికి నాకుగలదు. యింకాయింతధనము పొందగలను॥

శ్లో॥ అసౌమయా హతశ్శత్రు హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోహ మహంభోగి సిద్ధోహం బలవాన్ సుఖీ॥

తా॥ ఈపగవా డిప్పటికి నాచేత చంపబడినాడు యింకాని తరశత్రువులనందరిని చంపివేయగలను, నేనేరాజును, నేనేసర్వభోగము ల ననుభవించువాడను, నేనేపుత్ర పౌత్రాదులతో కూడుకొని కృతార్థుడనైయున్నాను, నేను సామాన్యమైన మనుష్యమాత్రుడనుగాను, మహా బలవంతుడను, మహాసుఖ మనుభవించువాడను, నేనొకడనే భూలోకమున కంతటి కీయలంకారముగా యున్నాను, మిగిలినవారందరుభూమికి భారమేగాని ప్రయోజనము కలవారు కారనియందురు॥

శ్లో॥ ఆఢ్యోభి జనవానస్మి కోన్యోస్తిస దృశోమయా ।
యక్ష్యేదాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితః॥

తా॥ నేనే ద్రవ్యముకలవాడను, గొప్పకులమందు పుట్టినవాడను, నాతోసమానమగు మనుష్యుడొకడునులేడు, నేనున్నుయాగములను చేయుచున్నాను, నటవిట గాయక గణికులకు బహుధనమును దానముచేయుచున్నాను, నాకంటె యెక్కువగా యాగదానముల చేయువాడెవడు గనుక నే మహానందభరితుడనై యున్నాను, అనియిటువంటియజ్ఞానముచేత మోహమునుపొంది వివేకహీనులై నరకములయందుపడుదురు. అని॥

శ్లో॥ అనేకచిత్త విభ్రాంతాః మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే శుచౌ॥ *

తా॥ అనేక కోర్కెలయందు నటించు చిత్తముచేత నాకర్షింపబడుచున్నవారై యజ్ఞానమనే వలయందుబడి చిక్కి శబ్దము మొదలగు భోగములయందు అత్యంత ఆసక్తిగలవారై కొంతకాలము బ్రతికియుండి చివరకు చచ్చినతరువాత మహారౌరవాది నరకములయందు బడుదురు॥

కాబట్టి ఓయిశిష్యా నాసురసంపదయనే మలినవాసన పునర్జన్మకు కారణమని చెప్పబడ్డది॥

ఈచెప్పబడ్డ యర్థమే విశేషముగా చెప్పబడుచున్నది॥

శ్లో॥ ఆత్మసంభావితా స్స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజంతేనామయజ్ఞైస్తే దంభేనవిధిపూర్వకం॥ *

తా॥ ఈయాసురప్రకృతిగలవారు తనబుద్ధిచేతనే తననుప్రాజ్ఞునిగాతలచువారును యెటువంటియోగ్యతగల పురుషులకుకూడా లొంగనివారును ధనముచేత నభిమానము గర్వముగలవారై లోకమందు సోమయాజులమను దీక్షితులవారమను ఈలాగంటికీర్తిని బొందుటకు మాత్రము కొన్నియాగములను అశాస్త్రీయముగా జేయుచుందురు॥

శ్లో॥ అహంకారంబలందర్పం కామంక్రోధంచసంశ్రితాః ।
మమాత్మపరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకః॥ *

తా॥ తనయందున్న గుణములచేత, లేనిగుణములచేత తనను అందరికంటే హెచ్చుగాతలచే చిత్తవృత్తి యహంకారమనబడును. అన్యులను అలక్ష్యముచేయుటకు నిమిత్తమైన చిత్తవృత్తి బలంబనబడును యేవృత్తిపుట్టినంగున ధర్మమార్గమును దాటినడుచునో ఆవృత్తి దర్పమనంబడును. కామక్రోధములు ప్రసిద్ధములు యిటువంటిగుణములతోటిగూడుకొని తనశరీరమందు నితురులయందును సర్వత్రజ్ఞానరూపిగానున్న పరమేశ్వరునియందు ద్వేషముగలవారై అనగా పరమేశ్వరాజ్ఞారూపములగు శృతిస్మృతులను యావత్తుప్రమాణములని విశ్వాసముంచక తమకిష్టమైన విషయములందుమాత్రము ప్రమాణముగా నమ్మియుందురని భావము. సన్మార్గమంద ప్రవర్తించే మహాపురుషులయొక్క గుణములనుచూచి యోర్చలేనివారైయుందురు॥

శ్లో॥ తానహంద్విషతఃక్రూరాన్ సంసారేషునరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు॥ *

తా॥ జ్ఞానస్వరూపునియందు ద్వేషముగలవారై క్రూరస్వభావముగల ఆ యధములైన మనుష్యులను ఆసురస్వభావముగల జన్మలయందు అనగా సర్పవ్యాఘ్రాదిజన్మలయందే ప్రవేశింప జేయుచుందును అని శ్రీకృష్ణభగవానులు సెప్పుచున్నారు॥

శ్లో॥ అసురీంయోనిమాపన్నా మూఢాజన్మనిజన్మని । మా
మప్రాప్యైవ కౌంతేయ తతోయాంత్యధమాంగతిం॥

తా॥ మూఢులగు నీమూఢజనులు క్రూరస్వభావముగల సర్ప వ్యాఘ్రాదిజన్మలనుబొంది పరమేశ్వరుడనైన నన్ను లభించేమార్గము ను చెందక అతిహీనమైనగతిని పొందుచుందురని శ్రీకృష్ణస్వామి చెప్పి యున్నారు॥

ఓయిశిష్యా ఈప్రకారముగా మలినవాసనయొక్క స్వరూపస్వభావ ఫలవిశేషములు చెప్పబడెను. ఇకను శుద్ధవాసననుగూర్చి చెప్పెదము॥

* శుద్ధవాసననిరూపణము. *

శ్లో॥ పునర్జన్మాంకురంత్యక్త్వా స్థితాసంభృష్టబీజవత్ ।
దేహార్థంధ్రియతేజ్ఞాత జ్ఞేయాశుద్ధేతిచోచ్యతే॥ *

తా॥ వేయించిన విత్తనములే ప్రకారము మొక్కమొలచుటకు యోగ్యతలేకయుండునో నాప్రకారమే పునర్జన్మకు కారణముగాక దేహధారణమాత్రమున కుపయోగానుండి తెలియదగిన తత్వమును చక్కగా తెలుసుకొనియుండు వాసన శుద్ధవాసన యనబడును॥

ఓయిశిష్యా ఈతెలియతగిన తత్వముయొక్క స్వరూపము భగవత్గీత పదమూడవ యధ్యాయమునందు చెప్పబడినది॥

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వామృతమశ్నుతే।
అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే॥ *

తా॥ వెనకజెప్పిన యమానిత్వాది సాధనములచేత దేనిని దె లిసికొనవలయునో నాతత్వమును తెలియజెప్పెదను ఏతత్వమును తెలి సినపురుషుడు మోక్షమును పొందునో ఆతత్వము జన్మలేకయున్న స ర్వాధికమైన పరబ్రహ్మస్వరూపమేను. ఈపరమాత్మ స్వరూపము అవా జ్మానసగోచరమైనందున వేదమునందుండు విధివాక్యములచేతగాని నిషే ధవాక్యములచేతగాని ప్రతిపాదింప నలవిగాదు॥

శ్లో॥ సర్వతఃపాణిపాదంతత్సర్వతోక్షిశిరోముఖం।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥ *

తా॥ ఇదిగాక నీపరబ్రహ్మ సర్వవ్యాపకమై సర్వాత్మకమైయు న్నందున సర్వప్రదేశములయందుండు హస్తపాదాద్యవయవములు తనవిగాను అట్లే నేత్రములు శిరస్సులు ముఖములు కర్ణములు యావత్తు తనవిగాను కలిగియుండును॥

శ్లో॥ సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం।
అసక్తంసర్వభృచ్చైవ నిర్గుణంగుణభోక్తృచ॥ ❋

తా॥ ఇదిగాక నీపరబ్రహ్మ సకలేంద్రియములను విషయములను ప్రకాశింపజేయుచు చెవి మొదలగు ఇంద్రియములుగాని శబ్దాదివిషయములుగాని లేనిదైయుండును. సమస్తపదార్థ సంబంధములేనిదైనప్పటికిన్ని సమస్తమునకు నాధారమయి యుండును. స్వతః సత్వరజస్తమోగుణములు లేనిదైనప్పటికి సత్వాదిగుణములను సన్నిధానమాత్రముచేత ప్రవర్తింపజేయుచుండును॥

శ్లో॥ బహిరంతశ్చభూతానా మచరంచరమేవచ। సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థంచాంతికేచతత్॥ ❋

తా॥ ఇదిగాక నీపరబ్రహ్మ సమస్త భూతములకు కారణమైనందున ఆభరణములలో బంగారు లోపల వెలుపల ఏకరూపముగా వ్యాపించియున్నట్టు సర్వభూతములయొక్క లోపల వెలుపల నేకరూపముగా వ్యాపించియున్నది. సర్వకారణమైనందుననే స్థావరములగు వృక్షపర్వతాదులుగాను తిరిగెడు మనుష్యాదులుగాను గూడాయున్నది ఈప్రకారము సర్వభూతస్వరూపముగా నున్నప్పటికి రూపాదిధర్మములులేనిదైనందున విస్పష్టముగా తెలియశక్యముగాదు. జ్ఞానములేనివారికి అనేకలక్షలయోజనముల దూరమున కావలయున్నట్టు దోచబడును. జ్ఞానముగలవారికైతేనో ప్రత్యగాత్మస్వరూపముగా నున్నందున చాలాసమీపమునందే యున్నట్టు కనుబడును॥

శ్లో॥ అవిభక్తంచభూతేషు విభక్తమివచస్థితం। భూతభర్తృచతత్ జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణుచ। జ్యోతిషామపితత్ జ్యోతిస్తమసః పరముచ్యతే॥ ❋

తా॥ ఇదిగాక సమస్తభూతములయందు సద్రూపముచేత ఒకటైయున్నప్పటికి ఆయావస్తు రూపముచేత వేరుగా కనుపడుచుండును. అనగా లోకమునందు కుండవున్నది వస్త్రమున్నది గోడవున్నది యిటువంటి వ్యవహారములయందు వేరువేరుగానున్నప్పటికి వున్నదని చెప్పబడే సద్రూపము అంతటనేకరూపముగానున్నందున పరబ్రహ్మ సత్తాస్వరూపముచేత నంతట నేకరూపముగానుండియు ఘటపటాది ఉపాధి భేదములచ్చేత వేరుగా కనుపడుచుండునని భావము॥

సమస్తభూతములను స్థితికాలమందు పోషించుచూ లయకాలమునందు నశింపజేయుచూ సృష్టికాలమురాగానే తిరిగియథాపూర్వకముగా స్వమాయాశక్తినవలంభించి సృజించుచుండును. యిదిగాక ప్రకాశింపజేయు స్వభావముగల సూర్యాది తేజస్సులనుకూడా ప్రకాశింపజేయు స్వభావముకలదిన్ని అజ్ఞానముచేత నెంతమాత్రముగానైన కనపడనిదనిన్ని చెప్పబడుచున్నవి॥

## ❋ జ్ఞేయస్వరూపమగు పరబ్రహ్మలక్షణము. ❋

జ్ఞేయస్వరూపమును ప్రతిపాదించే నీశ్లోకములయందు తటస్థలక్షణముచ్చేత ప్రతిపాదించుటకుగాను సోపాధికబ్రహ్మస్వరూపమును స్వరూపలక్షణముచేత ప్రతిపాదించుటకుగాను నిరుపాధిక బ్రహ్మస్వరూపమును ప్రతిపాదింపబడినది. ఓయిశిష్యా ఈబ్రహ్మమునకు రెండు లక్షణములుగలవు. అవియేవన; స్వరూపలక్షణమనియు తటస్థలక్షణమనియు రెండులక్షణములుగలవు. అదెట్లన ఒకానొక సమయమునందు లక్ష్యవస్తువుతో సంబంధించి లక్ష్యవస్తువును తెలియజేయునది తటస్థలక్షణమని చెప్పబడును. యిందుకు దృష్టాంతమును జెప్పెదము. యజ్ఞదత్తుడనువాడు కాశీపట్టణములో దేవదత్తుడను బ్రాహ్మణుని గృహమునకుపోదలచి యచ్చట దేవదత్తునిగృహమెద్ది యో తెలియక సమీపమందున్న యొకమనుష్యునిజూచి దేవదత్తగృహమెద్దియనియడిగెను. అప్పుడా దేవదత్తగృహమందొక కాకమెకటియుండగాచూచి యామనుష్యుడు కాకముగలది దేవదత్తునిగృహమని చెప్పిపోయెను. యిందుచేత యజ్ఞ

దత్తుడు దేవదత్తునిగృహమెరిగి యందులోప్రవేశించెను. యిచ్చట దేవదత్తునిగృహములక్ష్యము। కాకము లక్షణము। ఈలక్షణమైన కాకముయెప్పటికిన్నీ ఈదేవదత్తుని గృహమందు సంభవించి యుండునదికాదు. యజ్ఞదత్తుడు దేవదత్తగృహమేదియని యడిగేకాలమునందు మాత్రముసంభవించియుండెను. గనుక నీకాకము దేవదత్తగృహమును తెలియజేయు విషయమై తటస్థ లక్షణమని చెప్పబడినది. ప్రకృతమందు నీప్రపంచముయొక్క జన్మస్థితిలయములకు కారణమైనది. పరబ్రహ్మయని చెప్పితే నిచ్చట పరబ్రహ్మ లక్ష్యము। జన్మస్థితిలయ కారణత్వము లక్షణము। ఈపరబ్రహ్మసృష్టికి పూర్వకాలమునందు ప్రళయమన కనంతరకాలమునందును నిష్ప్రపంచమై నిర్విశేషముగా నున్నందున నీజన్మస్థితికారణత్వ మీజన్మస్థితి కాలములయందుదప్ప తక్కినకాలములయందీపరబ్రహ్మయందుండునదికాదు. అయిన పరబ్రహ్మ స్వరూపమును తెలియజేయుచున్నందున నీజగ జన్మస్థితిలయ కారణత్వము పరబ్రహ్మమును తెలియచేసేవిషయమై తటస్థలక్షణమని చెప్పబడును. ఎప్పటికిని లక్ష్యవస్తువుతో సంబంధించి లక్ష్యవస్తువును తెలియజేయునది స్వరూపలక్షణ మనబడును.

ఇందుకు దృష్టాంతమును జెప్పెదము. ఎప్పుడును చంద్రస్వరూపమునుజూచి యెరుగని పురుషుడు మరియొక పురుషునిజూచి ఈనక్షత్రమండలమందు చంద్రుడనే వాడెవ్వడని యడుగగా విశేషకాంతిగలవాడె చంద్రుడని చెప్పెను. యిట్లుచెప్పగా నాపురుషుడు చంద్రస్వరూపమును తెలుసుకొనెను. యిచ్చట చంద్రుడు లక్ష్యము। విశేషకాంతిలక్షణము। ఈవిశేషకాంతి చంద్రునియందొకానొకప్పుడు సంబంధించియుండునదికాదు. సర్వకాలములయందు సంబంధించియుండును. సర్వకాలములయందు సంబంధించియుండి చంద్రుని తెలియచేయుచున్నందున ఈవిశేష ప్రకాశము స్వరూపలక్షణమని చెప్పబడెను. ప్రకృతమందు సత్యజ్ఞానానందములు బ్రహ్మకు స్వరూపలక్షణము। యిందులో పరబ్రహ్మలక్ష్యము। సత్యజ్ఞానానందములు లక్షణములు। ఈసత్యజ్ఞానానంద

ము లొకప్పుడు మాత్రము బ్రహ్మతో సంబంధించియుండి మరియొకప్పుడు సంబంధించక యుండునవికావు. గనుక నీసత్యజ్ఞానానందములు బ్రహ్మస్వరూపమును తెలియజేయువిషయమై స్వరూపలక్షణమని చెప్పబడును. ఓస్వామీ యీవాసనయొక్క లక్షణమును ప్రతిపాదించునప్పుడు వెనకముందు యుక్తాయుక్తములను విచారించకనే ప్రవర్తించునది వాసనయని చెప్పియుంటిరి॥ శిష్యునిప్రశ్న.

జ్ఞేయమగు పరబ్రహ్మను తెలుసుకొనే జ్ఞానము విచారముచేతకలుగునదిగాని విచారములేక కలుగునదికాదు. గనుక జ్ఞానజ్ఞేయమగుపరబ్రహ్మజ్ఞానము యేలాగున శుద్ధవాసనయనిచెప్పవచ్చునని సమాధానమును చెప్పుచున్నాను.

ఓయి వాసనాలక్షణమును చెప్పినప్పుడే దృఢభావనచేత వెనకముందు విచారింపక ప్రవర్తించునది వాసనయని చెప్పినారము. గనుక అనేకజన్మములయందు దృఢముగా నభ్యసింపబడియున్నందున అహంకార మమకార కామక్రోధ లోభాది మలినవాసన లేప్రకారముపరులచే నుపదేసింపబడకపోయిన స్వయముగానే పుట్టుచుండునో నాప్రకారమే బ్రహ్మజ్ఞానమును మొదట గురూపదేశ వేదాంతవాక్య విచారాదులచేత నుదయించినప్పటికి సర్వకాలము యేమరక శ్రద్ధాభక్తులతోటి బ్రహ్మతత్వమును ధ్యానించుటచేత కొంతకాలమున కాపరబ్రహ్మస్వరూపము ప్రయత్నములేకనే ఘటాదివస్తువులవలె తోచుచుండును. ఇటువంటి ప్రయత్నములేక కలిగేబ్రహ్మజ్ఞానముతోటి కలసి ప్రవర్తించునే శ్రోత్రాదింద్రియ వ్యవహారము శుద్ధవాసనయని చెప్పబడినది.

ఇట్టి శుద్ధవాసన దేహయాత్రకుమాత్ర ముపయోగించుగానిదంభాహంకారద్యసురసంపదను పుట్టించుటకు జన్మాంతరమును సంపాదించే ధర్మము నార్జించుటకున్ను అగ్నిలోబడి మాడినవిత్తులు బొట్టలోబోసి నిండించుటకుమాత్ర ముపయోగించునుగాని మంచియన్నమును చేయుటకుగాని పైరును మొలిపించుటకుగాని ఏప్రకార ముపయోగించవో నాప్రకారమే వుపయోగించదు. ఓయిశిష్యా ఈ మలినవాసన

లోకవాసనయని శాస్త్రవాసనయని దేహవాసనయని మూడువిధము లుగా యున్నది॥

## ❋ లోకవాసన వివరణము. ❋

లోకవాసనయనగా లోకములోనుండు జనులందరు నన్నుఏప్ర కారముగా నిందించకయుందురో ఏప్రకారము స్తుతిచేయుదురో నాప్ర కారము సంచరించెద ననే యభిమానము లోకవాసనయనబడును. ఈ వాసన సంపాదించుటకు శక్యమైనది కానందున మలినవాసనయని చె ప్పతగియున్నది అది యెటువలెనంటే॥

శ్లో॥ కోన్వస్మిన్ సాంప్రదంలోకే గుణవాన్ కశ్చవీర్యవాన్ ।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః॥ ❋

తా॥ పూర్వకాలమందు వాల్మీకిమహాఋషి యానారదమహా ఋషినిగూర్చి పూజనలగావించి యోస్వామీ ఈలోకమునందు సమస్త మైనపురుషులలో సత్యపురుషుడు యెవడుగానుండును. శత్రుసైన్యము లోనికి తనయింటిలోపలికివలె వెళ్లు సామర్థ్యముకలవాడునుసకలధర్మ ములను తెలిసినవాడును ఉపకారము యెప్పటికిని మరువనివాడునుఆడి బొంకనివాడును సత్యవ్రతమును మరణకాలమునందుకూడా విడువని వాడును యెవడుగానుండునో కరుణించి యాపురుషుని దెలుపవేయన న్నారదమహాముని యోచించి చెప్పనారంభించెను॥

శ్లో॥ ఇక్ష్వాకు వంశప్రభవో రామోనామ జనైశ్రుతః ।

తా॥ ఇక్ష్వాకు వంశమునందు బుట్టిన రాముడనే యొక పురు షుడు సమస్తజనులచేత తెలియబడి నీవడిగిన సమస్తగుణములు కలవా డని వుత్తరముజెప్పిరి. ఇట్లునారదాది మహాఋషులచే నాదరింప దగిన సుగుణములుగల శ్రీరాములవారికిన్ని పతివ్రతా శిరోమణియైన జగన్మా తయగు సీతాదేవికిన్ని వినుటకు శక్యముగాని లోకాపవాదముప్రాప్తిం చినది. యికను సాధారణ మనుష్యులు యెట్లు లోకవిరోధము లేకుం డా సంచరించగలరు. ఇదిగాక దక్షిణదేశపు బ్రాహ్మణులచేతఉత్తరదే శపు బ్రాహ్మణులు వేదవేదాంతములను చదివినవారైనప్పటికి మాంసభ

క్షణము చేయుచున్నారని నిందింపబడుచున్నారు. ఉత్తరదేశబ్రాహ్మణులచేత దక్షిణదేశపు బ్రాహ్మణులు మేనరికమును జేయుచున్నారని నిందింపబడుచున్నారు ఋగ్వేదబ్రాహ్మణులు శుక్లయజుర్వేదముకంటె ఋగ్వేదము హెచ్చని తలచెదరు. ఇటువలె తమతమ కుల గోత్ర బంధువర్గేష్ట దేవతాదులను హెచ్చని తలచి స్తుతిచేయడము యితరులకులగోత్రాదులను తక్కువైనవని నిందించడము పండితులు మొదలు పామరులవరకు ప్రసిద్ధముగా గనుపడుచున్నది॥

శ్లో॥ శుచిః పిశాచో వికలో విచక్షణః ।
క్షమోహ్యశక్తో బలవాఞ్చదుర్బలః।
నిస్స్వోహ్యచోరః సుభగోహ్యకామీ।
కోలోకమారాధయితుంసమర్థః॥ *

అని పూర్వగురువులచే చెప్పబడినది॥

తా॥ ఈలోకములో నొకడు సదాచారము గలవాడుగాను మరియొకడు దురాచారము గలవాడుగానుండును ఒకడు విద్యాహీనుడై మూర్ఖుడుగానుండును మరియొకడు పండితుడుగానుండును ఒకడు పుష్టిగలవాడై సమర్థుడైయుండును మరియొకడు శరీరపాటవములేకబలహీనుడుగానుండును ఒకడు ద్రవ్యబల మనోబలములుగలవాడైయుండును మరియొకడు యివి రెండును లేక యుండును. ఒకడుధనములేక బీదవాడుగా నున్నప్పటికి దొంగతనము మొదలగు పనులులేకయుండును మరియొకడు ధనముగలిగియున్నను దొంగపనులు మొదలగునవి జేయుచుండును ఒకడు చక్కనివాడైనను కాముకుడు కాకయుండును మరియొకడు కురూపియైనను అతికాముడైయుండును. వీరందరు నొకొక్కరిస్థితిని యొకరొకరు నిందించుచుందురు. కాబట్టి సకలజన చిత్తములననుసరించి సంచరించుట కెవనికి శక్యమై యుండదని యర్థము॥

ఇదిగాక॥

శ్లో॥ విద్యతేన ఖలుకశ్చిదుపాయః ।
సర్వలోక పరితోష కరోయం।

సర్వదాస్వహిత మాచరణీయ్యం।
కింకరిష్యతిజనోబహుజల్పః॥

అని కూడా వినబడుచున్నది॥

తా॥ సకలజనులను సంతోషింపజేయు నుపాయము లోకము నందొకటియును గనుపడదుగాన తనకు హితమైన మార్గము నాలోచించి తిరుగవలెనేగాని లోకులు భూషింతురో నిందింతురో యని ఆలోచించతగదు వేరు వేలుమాటలాడుజనులు ఏమిజేయుదురని యర్థము॥

కాబట్టి ఓయిశిష్యా నీలోకవాసన మలిన వాసనమనే యభిప్రాయనుచ్చేతనే తత్వజ్ఞాని ఈలోకులందరు దూషించినా భూషించినా శాస్త్రవిహిత ధర్మములనాచరించుచు సమాన బుద్ధిగలవాడై యుండవలయును॥

అనిన శిష్యుండు యోస్వామి శాస్త్రవాసన యెటువంటిదో దెలుపవేయనిన శాస్త్రవాసనను జెప్పనారంభించెను॥

ఓయిశిష్యా నీశాస్త్రవాసన పాఠవ్యసనమని బహుశాస్త్రవ్యసనమని అనుష్టాన వ్యసనమని మూడువిధములు॥

ఈ పాఠవ్యసనము భరద్వాజమునియందు గనుబడుచున్నది అదెట్లన భరద్వాజుడనుఋషి మూడుపురుషాయుష్య కాలములయందు మూడు వేదములనభ్యసింపగా దేవేంద్రుడువచ్చి మీకేమికావలయునని యడుగగా దేవేంద్రా నాలవవేదము సంపూర్ణముజేయ వరమివ్వవే యన. ఓయిభరద్వాజ ఇది యొకపురుషునకు సాధ్యముకానందున మలినవాసనయనిబోధించి, ఓయిభరద్వాజ ఈవృధాపాఠము ప్రయోజనకారి కాదని మోక్షసాధనమగు సగుణ బ్రహ్మవిద్య నుపదేశించినటుల పురాణములయందు వినబడుచున్నది॥

ఓయి సుగుణశాలీ వగు శిష్యుడా బహుశాస్త్రవ్యసనమును చెప్పుచున్నాము వినుము ఇందుకు దూర్వాసుడనుఋషి యనేకవిధములగు శాస్త్రపుస్తకములను సంపాదించి వాటితోగూడా శివదర్శనమునకై

కైలాసమునందుండు సాంబసివునిసభకుపోగా ఆసభనుండు ఋషులలో నారదమహాముని యాదుర్వాసులనుజూచి నీవుబహుశాస్త్రముల కట్ట నుమోయుచున్నావు వీటిసారము నీకు తెలియదుకస్తూరిమొదలగు సుగంధముల భారమునుమోయు గాడిదకును నీకును భేదమేమియులేదని ఆక్షేపించిరి అందువలన దూర్వాసముని రోషయుక్తుడై పుస్తకకట్టను జలధిలో పారవైచి సాంబమూర్తిచేత నాత్మవిద్యనుపదేశింపబడి కృతార్థుడాయెనని శివగీతలయందు చెప్పియున్నది॥

కాబట్టి బ్రహ్మవిద్యయనునది బహిర్ముఖుడై విషయాసక్తిగలిగి గురుకటాక్షపాత్రుడు గానివానికి సర్వశాస్త్రములను చూచినా కలుగనేరదు॥

యిందుకుప్రమాణము॥ శ్రుతి॥

నాయమాత్మా ప్రవచనేనలభ్యో న మేధయాన బహునాశ్రుతేన॥

తా॥ ఈయాత్మ గురుకటాక్ష పాత్రులుకానివారికి కేవల వేదాంతశాస్త్రమును అనేకసార్లు శ్రవణముచేసిన దానియర్థమును మననముజేసినా మనస్సునందనేకమార్లు ధ్యానముజేసినా తెలియబడదని యర్థము॥

శ్లో॥ బహుశాస్త్రకథాకంథా రోమంథేనవృథైవకిం ।
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్వజ్ఞైర్జ్యోతిరాంతరం॥ *

తా॥ అనేకశాస్త్రములను మాటిమాటికి పాఠముజేసినందున ప్రయోజనమేమియులేదు గనుక తత్వజ్ఞులగు పురుషులు హృదయపుండరీకమునందుండు స్వప్రకాశ పరబ్రహ్మను ప్రయత్నపూర్వకముగా తెలుసుకోవలయును॥

శ్లో॥ ఆదిత్యచతురోవేదాః ధర్మశాస్త్రాణ్యనేకశః । బ్రహ్మ
తత్వంనజానాతి దర్వీపాకరసంయథా॥ *

తా॥ నాలుగువేదములను మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములను మీమాంసాది శాస్త్రములను చదివియును అన్నాదిపదార్థము

లపాకముఁజేయు గరిటె రుచి నెరుగనట్లు॥ శాస్త్రసారమగు చిద్రూ బ్రహ్మమును నెరుగఁడు॥

ఓయిశిష్యా గురుకటాక్షపాత్రుఁడుగాని వానికి సమస్తశాస్త్రములు తెలిసినా వాటియొక్క సారార్థమైన పరబ్రహ్మము తెలియబడదని చెప్పియున్నది॥

ఇదియునుంగాక చాందోగ్యోపనిషత్తులో నారదమహాముని నాల్గువేదములను అరువైనాల్గువిద్యలను సంపూర్ణముగా చదివి బ్రహ్మజ్ఞానములేనివాఁడై సనత్కుమారునివద్దికిపోయి వారివలన నాత్మతత్వమును తెలిసి కృతార్థుఁడాయెనని వినబడుచున్నది. ఓయిశిష్యా అనుష్టానవ్యసనమనునది విష్ణుపురాణములో ఋభుమహాఋషియొక్క శిష్యుఁడగు నిదాఘునియందును వాసిష్టరామాయణములో దాశూరుడనే బ్రాహ్మణునియందును వున్నట్టు చెప్పబడియున్నది॥

అదియెట్లనిన నిదాఘుడను బ్రాహ్మణుడు ఋభుమహాముని యొద్ద సమస్తవేదవేదాంగములను సమాప్తముగాచదివి గృహస్థాశ్రమము అంగీకరించి అశాస్త్రోక్తముగా కర్మలచేయవలయుననే అభిమానముతో కర్మలజేయుచుండగా నాశిష్యునికి బ్రహ్మవిద్యయందుశ్రద్ధను కలుగజేయుటకై శిష్యగృహమునకుబోయి కొన్నియుక్తులచేత బ్రహ్మవిద్యనుపదేశించి యాశ్రమమునకుపోయి కొంతకాలమునకు శిష్యుడు బ్రహ్మవిద్యనిష్టకలవాఁడైయున్నాఁడా లేదా యని దెలియుటకు తిరుగా నిదాఘునియింటికివెళ్లగా అప్పటికి యానిదాఘుడు కర్మయందేనడుచుటకు శ్రద్ధగలిగి యుండటంజూచి ఖిన్నుడై యాతనికి బ్రహ్మవిద్యయందు నిష్టదృఢముగా కలిగేలాగున బోధించిరని విష్ణుపురాణమునందు వినబడుచున్నది.

ఇదియునుంగాక దాశూరుడను బ్రాహ్మణుడు కర్మానుష్టానమునందు చాలాశ్రద్ధకలవాఁడై యోగ్యమైనదేశమును పరీక్షించుటకీభూమియందంతటనుతిరిగి యోగ్యమైనదేశమును కానకపోయెనని వాసిష్టరామాయణమందు చెప్పబడినది.

ఈకర్మవాసన మలినమని ముండకోపనిషత్తులో వర్ణింపబడినది.

శ్రుతి॥ ప్లవా హ్యేతే అదృఢయజ్ఞరూపా।
అష్టాదశోక్తమవరంయేషుకర్మా।
ఏతత్ శ్రేయోభినందంతిమూఢా।
జరామృత్యూతేపునరేవాపియంతి॥

తా॥ బ్రహ్మ అధ్వర్యుడు హోత ఉద్గాత ప్రతిప్రస్థాత మైత్రావరుణ సోమప్రవాక వీరుమొదలగు పదియారుగురు ఋత్విక్కులు పత్నీయజమానులిద్దరూ సమష్టికి పదునెనిమిది పురుషులచేత సంపాదింపబడి శరీరఆయాస సాధ్యమై స్వల్పఫలమును కలుగచేసేదైనందున నికృష్టమగు కర్మరూపమైన యజ్ఞములు సంసారసముద్రమును దాటనిచ్చగలవానికి ఓటిఓడలవంటి సాధనములు ఈ యజ్ఞములనే సుఖసాధనములుగానమ్మి యెవరుచేయుచుందురో వారుమాటిమాటికి దుఃఖరూపమైన పుట్టుచావులనే సంసారమునే పొందుచుందురుగాని ఈసంసారమునుండి తరింపజాలరు॥

శ్రుతి॥ అవిద్యాయామంతరేవర్తమానాః।
స్వయంధీరాః పండితంమన్యమానాః।
జంఘన్యమానాః పరియంతిమూఢాః
అంధేనైవనీయమానాయథాంధాః ॥

తా॥ అజ్ఞానములోపడి యేమియు దెలియకుండా వుండిన్నీ తాము సమస్తమును తెలిసిన పండితులమని తలంచి రోగాద్యనేకానర్థముల చేత పీడింపబడి పుట్టుగుడ్డివారిచేత దారిచూపింపబడి నడిచే పుట్టుగుడ్డివారివలె యెప్పటికిని దారిగానక బాధలయందే పడుచూ తిరుగుచూనుందురు॥

శ్రుతి॥ ఇష్టాపూర్తంమన్యమానావరిష్టం।
నాన్యత్ శ్రేయోవేదయంతేప్రమూఢాః।
నాకస్యపృష్ఠేతేసుకృతేనుభూత్వా।
ఇమంలోకంహీనతరంవావిశంతి॥

తా॥ యని యాగాది శ్రౌతకర్మలను వాపీకూప తటాకనిర్మా ణాది స్మార్తకర్మలను ముఖ్యముగా పురుషార్థ సాధనములుగా తలచి మూఢులగుజనులు మోక్షమనే పరమపురుషార్థము వున్నదనిదానికిసా ధనమగు తత్వజ్ఞానమొకటియున్నదని తలచక యుందురు. ఇట్టిమూ ఢులు స్వర్గఫల మనుభవించి అతిహీనమగు నీమనుష్యలోకమును గూర్చి తిరిగి ప్రవేశింతురు॥

ఓయిశిష్యా యిటులనే భగవద్గీతలయొక్క రెండవ అధ్యాయ మునందు కూడా చెప్పబడియున్నది॥

శ్లో॥ యామిమాం పుష్పితాంవాచం ప్రవదంత్య విపశ్చితః।
వేదవాద రతాఃపార్థ నాన్యద స్తీతివాదినః।
కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదాం ।
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్య గతింప్రతి॥ ✱

తా॥ ఓయియర్జునా మూఢులగు పురుషులు వేదములయందు ఫలములను స్తుతించెడు అర్థవాదపు మాటలయందు ప్రమాణబుద్ధులైవే దవాక్య ఫలమగు స్వర్గమే ఆధారముగాని మరియొక ఈశ్వరుడనే ప్రా ప్యములేదని చెప్పువారై యెల్లప్పుడు ఫలముల గోరుచు స్వర్గమేమోక్ష మని తలచువారై స్వర్గభోగములగు దేవభోగములను పొంద సాధనల గు జ్యోతిష్టోమాది క్రియలను మనుష్యజన్మలను వాటియందు చేయుక ర్మలను ఫలములగు సుఖదుఃఖాదులను కల్గించు పుష్పములతోనున్న విష వృక్షమువలె యవిచార సుందరమగుకొన్నివాక్యములనుచెప్పుచుందురు॥

శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాప హృతచేతసాం ।
వ్యవసా యాత్మికాబుద్ధి స్సమాధౌ నవిధీయ్యతే॥ ✱

తా॥ వెనుకచెప్పిన ధనభోగాసక్తులై ఫలములజెప్పు వేదవా క్యముల ఆకర్షింపబడిన మనస్సుగల యాపురుషులకు నిశ్చయబుద్ధి గలుగ దు అనగా వేదములం దచ్చటచ్చట యన్యాయభిప్రాయములతో నిత్య ములనిచెప్పిన స్వర్గఫలములను నిత్యమనినమ్మి సాభిప్రాయగా జెప్పిన

ఈశ్వరునియందు సత్యమైన జ్ఞానములేని వివేకహీనులగు పురుషులకు పరబ్రహ్మజ్ఞానమందు బుద్ధి పుట్టనేరదని యభిప్రాయము॥

శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

తా॥ సత్వ రజస్తమో గుణులగు పురుషులగూర్చి యాగాదులను వేదములు బోధించుచున్నవి. ఓయి యర్జునా ఫలవాంఛలేనివాడవు కమ్ము సుఖదుఃఖములను ద్వంద్వములను సహించు స్వభావుడవై ధైర్యము నవలంబించి సుఖాసుఖముల కోరక సుఖాసుఖములకును సర్వశక్తుడు పరమేశ్వరుడే గనుక నెరకర్తుననే మహావిశ్వాసము గలిగియుంటివో నిష్కామత్వమును బొందగలవు॥

శ్లో॥ యావానర్థ ఉదాపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

తా॥ కొద్దికొద్దిజలముగల గుంటలలో స్నానపానాది పనులు వేరువేరుగా చేయవలయు నప్పటికి చాలానీరుగల పెద్దచెరువులో స్నానపానాది క్రియలన్ని యొకచోటే చేయుటకు శక్యమైయెట్లుండునో ఆప్రకారమే యొక్కొక కర్మచేత వేరువేరు పొందదగిన ఫలములన్నియు నొక బ్రహ్మజ్ఞానముచేతనే బ్రహ్మవేత్తయగువానికి లభించునుయని యిట్లు కృష్ణభగవానులు ఆనతిచ్చియున్నారు. కాబట్టి ఓయిశిష్యా శ్రుతిస్మృతులయందు కర్మవాసనయనునది మలినము గనుక పునర్జన్మకు కారణమని విస్పష్టముగా చెప్పబడినది యనిన విని ఓదయానిధివగుగురుమూర్తి దేహవాసనయనునది యెటువంటిదో కరుణించి తెలుపవేయనిన నాగురుమూర్తి చెప్పందొడంగె॥

## ✻ దేహవాసన నిరూపణము.

ఓయిశిష్యా దేహవాసనయనునది దేహాత్మతత్వభ్రాంతియనిగుణాదాన భ్రాంతియని దోషాపనయన భ్రాంతియని మూడువిధములుగానున్నది. అందులో దేహమందాత్మత్వ భ్రాంతికలదని॥

భా॥ దేహమాత్రం చైతన్య విశిష్టమాత్మేతి
ప్రాకృతా లోకాయతికాశ్చ ప్రతిపన్నాః॥

తా॥ జ్ఞానముతో గూడియున్న ఈదేహమే యాత్మయని శాస్త్రజ్ఞానములేని పురుషులున్ను శాస్త్రజ్ఞానము కలవారిలో చార్వాకులున్ను తలచుచున్నారని భాష్యకారులచే చెప్పబడినది॥

కాబట్టి ఓయిశిష్యా లోకాయతికమనే నామమునుగలదై యున్నది. ఈమతము దేవగురువగు బృహస్పతిచే చేయబడినది. యిందులో పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఈనాలుగే భూతములు. యివి స్త్రీ పురుషశరీరములయందు శుక్ల శోణితములుగా నేర్పడి కూడికచేత దేహాకారమును పొందినప్పుడు వీటియందు జ్ఞానమను నొక విశేషగుణము పుట్టును. జ్ఞానముతోకూడిన దేహమే యాత్మయని చెప్పబడును గాని యీదేహముకంటే వేరై జ్ఞానమునకు ఆశ్రయమైన యాత్మయను జీవుడొకడులేడు. ప్రత్యక్షమొకటియే ప్రమాణము గనుక శివలోక విష్ణులోకాదులు కల్పింపబడినవి గాని వాస్తవముగా లేవు సుఖమేస్వర్గము దుఃఖమేనరకము దేహాకారముగా పరిణమించిన నాలుగు భూతములకు వియోగము కలుగుట మరణమని చెప్పబడును. ఇదియే మోక్షము ఇట్టి మోక్షము అందరికి సులభముగా సంభవించుచుండును. ఈమోక్షమునుగూర్చి ప్రయత్నముచేయ గిట్టదు. వైదికశాస్త్రములన్నియుప్రత్యక్షములకు విరుద్ధములైనందున సమ్మతగినవి కావని చెప్పెదు చార్వాకులు పంచకోశ వ్యతిరిక్తమగు చైతన్యాత్మను దెలియనేరక ఇట్లు జెప్పుచుందురు. యిందుకు॥

బలిచక్రవర్తి కొమారుడగు విరోచనుడు ఆత్మతత్వమును తెలియగోరి బ్రహ్మవద్దికిపోయి ముప్పదిమూడు సంవత్సరములు బ్రహ్మచర్యముతో శిశ్రూషచేసికూడా చిత్తదోషము నశించనందున బ్రహ్మచేత నుపదేశింపబడిన దేహాతిరిక్తాత్మ తత్వము నెరుంగజాలక దేహమునే యాత్మగాదెలిసి దైత్యదానవులకందరికి నాప్రకారమే ఉపదేశించెనని

చాందోగ్యోపనిషత్తు యెనిమిదవ ప్రతిపాఠములో వినబడు చున్నది. యని బలికిన ఓస్వామీ గుణాధానభ్రాంతి యెట్టిదో దెలుపుమన॥

## ——• గుణాధానభ్రాంతి వివరణము. •——

ఓయిశిష్యా ఈదేహమునందు గుణములు గలుగ జేయుదుననే భ్రాంతి గుణాధాన భ్రాంతి యనబడును. ఇదిలౌకిక గుణాధానభ్రాంతియని శాస్త్రీయ గుణాధానభ్రాంతియని రెండువిధములు.యిందులో సౌందర్యగుణములను ఈదేహమునకు సంపాదింపవలయుననేది లౌకీక గుణాధాన భ్రాంతియని చెప్పబడును॥

శాస్త్రోక్తపావనాది గుణముల నీదేహమునకు సంపాదింపవలయుననేది శాస్త్రీయ గుణాధాన భ్రాంతియని జెప్పబడును॥

ఈలోకమునందు కొందరు మధురముగా పాడుటకు తైలములు పుచ్చుకోవడమును మరియములను భక్షించడమును చేయుచున్నారు॥

దేహమునకు మెత్తదనమును చక్కదనమును కలుగజేయుటకు గాను స్నానము సన్నవస్త్రి సుగంధాది ధారణము మొదలైన వాటిని చేయుచుందురు. శాస్త్రీయగుణములగు పావనములను గలుగ జేయుటకు గంగాస్నాన సాలగ్రామ తీర్థప్రాశనాదులను జేయుచుందురు॥

ఓయిశిష్యా దోషాపనయన భ్రాంతియనునదియు లౌకీకమని శాస్త్రీయమని రెండువిధములు. లౌకీకదోషములనగా ముఖ దుర్గంధాదులు శాస్త్రీయ దోషములనగా అపవిత్రాదులు॥

యిందులో లౌకికదోషములగు ముఖదుర్గంధాదులను నివర్తింపజేయుటకు వైద్యోక్త చికిత్సలను చేయుచుందురు. శాస్త్రీయ దోషములగు అపవిత్రములను శౌచాచమన స్నానసంధ్యావందనాదుల చేయుచుందురు॥

పాటకులు కొందరు కంఠమాధుర్యమును సంపాదించుటకు ప్రయత్నమెంతజేసిన పొందకనే యున్నారు. స్నానాదులను నిరంతరము జేసినప్పటికి కొందరి శరీరములు కఠినస్పర్శ కలవిగానే యున్నవి॥

సన్నవస్త్ర సుగంధదారణాదులచేత కనుపడేచక్కదనము లు సన్నవస్త్రసుగంధాదులందున్నవిగాని దేహమందు లేవు.

శ్లో॥ మాంసాసృక్పూయవిణ్మూత్ర స్నాయుమజ్జాస్థిసమ్మతౌ,
దేహేచేత్ప్రీతిమాన్మూఢో భవితానరకేపిసః॥ *

తా॥ మాంసము రక్తము దుర్వాసన అమేధ్యము మూత్రము నరములు మెదడు యెముకలు వీటికూడికెగానుండే ఈశరీరమునందు ప్రీతిగల మూఢుడు నరకమందుగూడా ప్రీతిగలవాడైయుండునని శ్రీ విష్ణుపురాణమునందు చెప్పబడియున్నది॥

శ్లో॥ స్వదేహాశుచిగంధేన నవిరజ్యేతయఃపుమాన్ ।
విరాగకారణంతస్య కిమన్యదుపదిశ్యతే॥ *

తా॥ తనశరీమందుండు దుర్వాసనచేత విరక్తినిబొందక నటించేపురుషునకు విరక్తిని సంపాదించే మరియొక కారణమేమి చెప్పతగియున్నది.

ఓయిశిష్యా లోకసిద్ధములగు చక్కదనాదిగుణముల నీశరీరమునందు సంపాదించుటకు శక్యముకాదు ఒకానొకప్పుడుసంపాదించిన మరినిముషమునకు తనదోషమునే ఈశరిరముచూపుచుండును.

గనుకనే.

శ్లో॥ సర్వాశుచినిధానస్య కృతఘ్నస్యవినాశినః ।
శరీరకస్యాపికృతే మూఢాఃపాపనికుర్వతే ॥

తా॥ సకలమైన అసహ్య మలమూత్రాదులకు నివాసమై స్నానసుగంధలేపన మాల్యధారణ ధూపనాది యత్నములచేత నెంతమంచినిచేశిన మరిక్షణములోనే వీటినంతా అడుగంటద్రోశి తనస్వాభావికదుర్గంధాదులను నీచశిరోమణియై బుద్బుదమువలెన స్థిరమైన ఈ శరీరమును పోషించుటకు మూఢులగుజనులు పరహింసాది పాపములను చేయుచున్నారే ఇదియేమివిచిత్రమని పూర్వులచేచెప్పబడినది॥

ఓయిశిష్యా శాస్త్రీయమగు గుణాధానము మరియొకశాస్త్రముచేత నివారింపబడుచున్నది యెట్లనగా॥

శ్రుతి॥ నహింస్యాత్సర్వభూతాని అనగా సమస్తభూతము లును హింసచేయతగదు హింసించినయెడల పాపముకలుగునని చెప్పె శాస్త్రము॥

శ్రుతి॥ అగ్నిషోమీయ్యంపశుమాలభేత ॥ అని

జ్యోతిష్టోమాదియాగములయందు అగ్నిషోములనే దేవతల నుద్దేశించి పశువును హింసించవలయునని చెప్పె మరియొక శాస్త్రముచేత భావింపబడె అగ్నిషోమీయ్యాహింస పాపముకాదని చెప్పినట్టు గంగాజల సాలగ్రామతీర్థ కురుక్షేత్రాదులు పవిత్రములనిచెప్పె శాస్త్రములు॥

ఓయిశిష్యా ఈలాగంటె శాస్త్రములు సచ్ఛాస్త్రశ్రవణ సత్పురుష సహవాస భక్తిమొదలయిన సద్గుణములు లేనివారికి గంగాస్నానాదులు పాపనివారకములు కావనిచెప్పి మరికొన్నిశాస్త్రములచే బాధింపబడి గంగాస్నానాదులు పవిత్రత్వ సంపాదకములు కావని చెప్పచున్నవి॥ భాగవత దశమస్కంధోత్తరభాగము॥

శ్లో॥ యస్యాత్మబుద్ధిః కుణపేత్రిధాతుకే।
స్వధీకళత్రాదిషు భౌమఇజ్యధీః।
యత్తీర్థబుద్ధిశ్చ జలేనకర్హిచి।
జ్ఞనేష్వభిజ్ఞేషుసఏవగోఖరః॥ అనిచెప్పియున్నది॥

తా॥ ఏపురుషుడు వాత పైత్య శ్లేష్మ ధాతువులచేచేయబడి జడమై పీనుగనుబోలిన ఈశరీరమునందు ఆత్మత్వజ్ఞానమున్ను భార్యాపుత్రాదులు నేనేయను యభిమానము రాళ్లు వెండి రాగి మొదలగు లోహములచే చేయబడిన బొమ్మలయందు దేవతా యభిమానమున్ను గంగాదిజలములందు తీర్థత్వాభిమానమున్ను కలవాడైయుండి బ్రహ్మజ్ఞానులగు మహానుభావులయందు ఆత్మత్వ మదియ్యాత్వ దేవత్వ తీర్థత్వ ప్రతిపత్తిలేనివాడైయుండునో అట్టిపురుషుడే పశువని గార్ధభమని చెప్పతగియున్నాడు॥

ఓయిశిష్యా శిలాదివిగ్రహములు గంగాది తీర్థములు ముఖ్యముగా దేవత్వ తీర్థత్వములు కలవికావని భాగవతమందే చెప్పబడినది॥

శ్లో॥ నహ్యమ్మయానితీర్థాని నదేవామృచ్ఛిలామయాః।
తేపునంత్యురుకాలేన దర్శనాదేవసాధవః॥ *

తా॥ జలమయములగు గంగా గోదావరి నదులు తీర్థములుగావు మన్ను రాళ్లు మొదలగువానిచే చేయబడిన బొమ్మలు దేవతలున్ను గారు ఈతీర్థములని దేవతలని మూఢజనులచ్చేత చెప్పబడు జలమయ మృచ్ఛిలామయములు తమనుసేవించేజనులను అనేకకాలమునకు పవిత్రులనుగా జేయునుగాని తత్క్షణమే పవిత్రులనుచేయజాలవు. గనుక ముఖ్యముగా తీర్థములని దేవతలని చెప్పతగినవికావు॥

ఓయిశిష్యా బ్రహ్మవేత్తలగు మహానుభావులు తమదర్శనమాత్రముచ్చేతనే అజ్ఞాన చీకటిని పోనడచి మనోదోషముల బోనడచి బ్రహ్మజ్ఞానమును కలుగజేసి జనులను పవిత్రులనుగా చేయుదురుగనుక బ్రహ్మవేత్తలగు సజ్జనులనే తీర్థములని దేవతలని ముఖ్యముగా చెప్పతగియున్నారు॥ ఇదిగాక।

శ్లో॥ అత్యంతమలినోదేహో దేహీచాత్యంతనిర్మలః।
ఉభయోరంతరంజ్ఞాత్వ కస్యశౌచంవిధీయ్యతే॥ *

తా॥ ఈదేహము మూత్రపురీషాది బంధురమయి యున్నందున నిండామలినమైనది ఆత్మయనునది సర్వదా అత్యంతపరిశుద్ధమైన పదార్థము ఈరెంటియొక్క స్వభావమును యోచిస్తే గంగాస్నానాదులచేత దేనికి శుద్ధిని సంపాదింప తగియున్నది కాబట్టి ఈగంగాస్నానాదులు బ్రహ్మవేత్తకు ప్రయోజనకారులు కావని తాత్పర్యము॥

కాబట్టి ఓయిశిష్యా ఈశరీరము దుర్గంధములకు ఆలయము రోగములపుట్ట రోగములునివర్తించవు నివర్తించినా మరలరోగములు కలుగును ఇదిగాక తొమ్మిది రంధ్రములనుంచి మలములుకారుచుండగా వెంట్రుకలనుండి నీరుకారుచుండగా నీశరీరమును స్నాన ధూపనసుగంధ

లేపనాదులచేత మర్గంధములను యెవడు పోగొట్టగలడు యిట్లు॥ పూర్వాచార్యులవారు చెప్పియున్నారు॥

శ్లో॥ నవఛిద్రకృతాదేహా స్రవంతిఘుటికాఇవ।
బాహ్యశౌచైనఃశుద్యంతి నాంతశ్శౌచంతువిద్యతే॥

తా॥ ఈదేహములు తొమ్మిది రంధ్రములుకలవై యెప్పుడున్ను చిల్లికుండలవలె మలములను స్రవించుచుండును శరీరము మీదిభాగములందు మన్ను జలములచ్చేత కడిగినందున శుద్ధిబొందవు లోపలిభాగములందు కడుగుటకు వీలుపడదు కాబట్టి ఓ యిశిష్యా నీమూఢవిధములగు దేహావాసన మలినవాసనయనియే చెప్పదగియున్నది. ఈదేహవాసన మలినవాసనయనే యభిప్రాయముచేతనే వాసిష్టరామాయణమునందు వసిష్టమహామునిచే చెప్పబడినది॥

శ్లో॥ ఆపాదమస్తకమహం మాతాపితృవినిర్మితః।
ఇత్యేకోనిశ్చయోరామ బంధాయసద్విలోకనాత్॥

తా॥ తల్లితండ్రులచేతచేయబడి సిరపాదాదులతోకూడిన నీశరీరము నేనేను అనునిశ్చయము అబద్ధపుజ్ఞాన మాటచేత నీయాత్మను సంసారమందు బంధించుటకు కారణమైయున్నది॥

శ్లో॥ సాకాలసూత్రపదవీ సామహావీచివాగురా।
సాసిపత్రవనశ్రేణి దేహోహమితియామతిః॥

తా॥ శరీరము నేనేనను బుద్ధికాలసూత్రమనే నరకమున్ను మహావీచి నరకమున్ను అసిపత్రవనపంక్తియనే నరకమున్ను అయివున్నది

శ్లో॥ సాత్యాజ్యాసర్వయత్నేన సర్వనాశేప్యపస్థితే।
స్ప్రష్టవ్యాసానభవ్యేన సశ్వమాంసేవపుల్కసీ॥

తా॥ ఆదేహాత్మబుద్ధి సర్వపాపములకు మూలమైయున్నందున తనకు యెన్నికష్టములువచ్చేటట్టయినా పడి సర్వప్రయత్నములనుచేసి ఈదేహాత్మబుద్ధిని విడువవలెను సజ్జనుడు ఈదేహాత్మబుద్ధిని కుక్కమాంసమును చేతిలోవుంచుకొనియుండే చండాలస్త్రీనివలె యంతమాత్రము అంటకూడదు॥

శ్లో॥ లోకవాసనయాజంతో శ్శాస్త్రవాసనయాపిచ।
దేహవాసనయాచాపి యథావన్నైవజాయతే॥

తా॥ లోకవాసనచేత దేహవాసనచేత శాస్త్రవాసనచేత ఈ మూడువాసనలచేతనులోకములోజనులకుతత్వజ్ఞానముపుట్టకయున్నది॥

ఓయిశిష్యా యేప్రకారము వాసనారహితము సంపాదింపవలయునో నాప్రకారమే మనోవాసన రహితముగూడా సంపాదింపవలయును॥

## * మనోవాసన నిరూపణము. *

ఓయిశిష్యా ఈమనస్సుయొక్క లక్షణము ప్రమాణమున్ను బృహదారణ్యోప నిషత్తులో చెప్పబడినది॥

మనస్సుయొక్క లక్షణము.

శ్రుతి॥ కామసంకల్పో విచికిత్సా శ్రద్ధా౽శ్రద్ధాధృతి
రధృతిర్హ్రీర్ధీర్భీ రిత్యేతత్సర్వంమనఏవ॥

అని మనస్సుయొక్క లక్షణము॥

తా॥ కామము సంకల్పము విచారేచ్ఛ శ్రద్ధ అశ్రద్ధ ధైర్యము అధైర్యము లజ్జ జ్ఞానము భయము ఇవి మొదలగు వృత్తులే మనస్సనిచెప్పబడును॥

అనగా నేత్రాదింద్రియములకు ఘటములు మొదలగు వస్తువులు కనుబడునట్టు సాక్షి చైతన్యమునకు కామసంకల్పాది వృత్తులు మన్నువలన కుండలవలె దేనినుండి పుట్టుచుండునో అది మనస్సని చెప్పబడును.

శ్రుతి॥ అన్యత్రమనా అభూమ నాదర్శం।
అన్యత్రమనా అభూవం నాశ్రౌషం।

శ్రుతి॥ మనసా హ్యేవ పశ్యతి మనసాశృణోతి॥

ఓయిశిష్యా ఈశ్రుతులు మనస్సువందు ప్రమాణము॥

తా॥ నామనస్సు మరియొకచోట నుండెను. అందువల్లనే దీనిని చూడకపోతిని. నామనస్సు మరియొకచోట వుండెను. అందువల్లనే ఈ

శబ్దమును వినకపోతిని. ఈపురుషుడు మనస్సుచేతనే చూచుచున్నాడు. మనస్సుచేతనే వినుచున్నాడని శ్రుతులకు రెంటికిని యర్థము॥

అనగా ఓయిశిష్యా కంటికి యెదురుగా వెలుతురులో ఘటమును చెవులదగ్గిర పెద్ద శబ్దమున్ను ఎదిమేలోకనక యున్నందున తెలియబడదో ఎవి మేలోకనియున్న ఘట శబ్దములు తెలియబడునో అదియేమనస్సు॥

ఈమనస్సు సమస్త వృత్తుల దెలియుటకు కారణమై యున్నది॥

శ్రుతి॥ తస్మాదపి పృష్టత ఉపస్పృష్టో మనసా విజానాతి॥

ఓయిశిష్యా ఈశ్రుతికూడా మనస్సును నిరూపించి కనుబరచుచున్నది॥

తా ॥ అదియెట్లనగా ఒకపురుషుడు యొకనిచేత వీపును స్పృశింపబడినవాడై యిప్పుడు చేతితో తాకినాడని యిప్పుడు వ్రేలితో తాకినాడని బాగా తెలుసుకొనుచున్నాడు. యిందులో తాకుడుమాత్రము చర్మేంద్రియముచేత దెలియబడినా ఇది వ్రేలిస్పర్శ ఇది హస్తస్పర్శయని తెలుసుకునేది మనస్సుగానే యుండవలయును. ఈవిశేషజ్ఞానము నేత్రేంద్రియముచేత కలుగునదికాదు. నేత్రేంద్రియము తనయెదుటనుండు విషయముల చూచునేగాని వెనుకభాగముల నుండువాటిని కనిపెట్టనేరదుగదా॥

కావున ఓయిశిష్యా వెనుకభాగమునందుండు విషయములనుకనిపెట్టునది మనస్సేనని నిశ్చయింప వలయును॥

ఓయి సుగుణశాలీ ఈమనస్సు మననము చేయుటవలన మనస్సనియు చింతించుటవలన చిత్తమనియు చెప్పబడుచున్నది॥

ఈచిత్తము సత్వరజస్తమో గుణములయొక్క కార్యములగు ప్రకాశ ప్రవృత్తి మోహములు కలదైయున్నందున సత్వరజస్తమోగుణమయమని తెలియబడుచున్నది॥

భగవద్గీతావాక్యము.

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ॥

తా ॥ ప్రకాశము ప్రవృత్తి మోహము యీమూడు క్రమము గా సత్వ రజస్తమో గుణోద్రేకముచేత కలుగుచుండునని భావము॥

ఇచ్చట ప్రకాశమనగా జ్ఞానమే కాని తెల్లనిరంగుగల ప్రకాశముకాదు॥

శ్లో॥ సత్వాత్సం జాయతేజ్ఞానం రజసాలోభ ఏవచ ।
ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞానమేవచ॥

తా ॥ సత్వగుణము చిత్తమునందు కలుగు సమయము నందు జ్ఞానము కలుగును. రజోగుణము కలుగునపుడు లోభము కల్గును. తమోగుణము కలుగునప్పుడు ప్రమాదము మోహము అజ్ఞానముగ్గు పుట్టుచుండును॥

శ్లో॥ సత్వంసుఖే సంజయతి రజకర్మణి భారత ।
జ్ఞానమావృత్యతుతమః ప్రమాదే సంజయత్యుత॥

తా ॥ సత్వగుణము సుఖమును పుట్టించి దానియందు పురుషుని ప్రీతిగలవానినిగా జేయును. రజోగుణము కర్మయందు ప్రీతిగల వానినిగా జేయును. తమోగుణము జ్ఞానమునుకప్పి ప్రమాదమునందు ప్రీతిగలవానినిగా జేయును॥

శ్లో॥ రజస్తమశ్చా భిభూయ సత్వంభవతి భారత ।
రజసత్వం తమశ్చైవ తమసత్వం రజస్తథా ॥

తా ॥ ఒకప్పుడు రజస్తమో గుణములను అడుగుపరచి సత్వగుణము హెచ్చియుండు మరియొకప్పుడు సత్వ తమోగుణములను అడుగుపరచి రజోగుణము హెచ్చియుండును. యొకప్పుడు రజసత్వముల నడుగుపరచి తమోగుణము హెచ్చియుండును॥

శ్లో॥ బాధ్యబాధ కతాంయాంతి కల్లోల ఇవసాగరే।

తా ॥ సత్వ రజస్తమో గుణములు మూడును మనస్సునందు బుట్టుచు సముద్రతరంగములవలె నొకదాని నొకటి బాధించునట్లుత్రిగుణము లొకటినొకటి బాధించుననికూడా మరియొక గ్రంథమునందు చెప్పబడి యున్నది॥

ఓ యిశిష్యా యిందులో తమోగుణము హెచ్చినప్పుడు దంభ దర్పములు మొదలగు నాసురసంపద గలుగును॥

రజోగుణము హెచ్చినప్పుడు లోకవాసన మొదలగుమూడువాసనలుపుట్టును సత్వగుణము హెచ్చినప్పుడు జ్ఞానము మొదలగుదేవసంపదపుట్టును॥

ఇందుకు భగవద్గీత ప్రమాణము.

శ్లో॥ సర్వద్వారేషు దేహేస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానంయదా తదావిద్యా ద్వివృద్ధం సత్వమిత్యుత॥

తా॥ ఈశరీరమందు సకలమైన యింద్రియములయందు ప్రకాశమను యథార్థజ్ఞాన మెప్పుడు పుట్టుచుండునో అప్పుడు సత్వగుణము వృద్ధినొందియున్నదని తెలియవలయును. ఇచ్చట విచారించగా మనస్సునది సత్వరజస్తమో గుణాత్మికమని చెప్పబడియున్నందున రజస్తమోగుణము లెప్పటికి మనసునుండి నివర్తింపవని తోచుచున్నది. ఐనా మనస్సునకు ముఖ్యమైన ఉపాదానకారణము సత్వగుణమేకాని రజస్తమోగుణములుకావు. రజస్తమోగుణములు రెండును సత్వగుణమునకుపష్టంభకములేకాని ముఖ్యకారణములుగావు. ఉపాదానకారణమునకు సహాయభూతములైన అవయవములే ఉపష్టంభకము లనబడును॥

ఇందుకు దాహరణము.

లోకములో కుండకు మన్నుపాదానకారణమైనందునముఖ్యకారణమనబడును. జలము గాలి తేజస్సు ఇదిమట్టికిసహాయముగాయున్నందున ఉపష్టంభకము లనబడును. ఈవిధమే మనసునకు సత్వగుణమే ఉపాదాన కారణము. రజతమస్సులు ఉపష్టంభకములని యర్థము॥

గనుకనే ఓయిశిష్యా జ్ఞానియగువాడు యోగము నభ్యసించితే రజస్తమస్సులు నశించి సత్వగుణముమాత్రము శేషించుచున్నది॥

శ్లో॥ జ్ఞశ్యచిత్తం మచిత్తంస్యాత్ జ్ఞచిత్తం సత్వముచ్యతే।

తా॥ జ్ఞానియొక్క అంతఃకరణము మనసని చెప్పబడదు. సత్వమనే చెప్పబడును గనుక ఈసత్వము చాంచల్యమునకు కారణమగు

రజోగుణముచే కలియనందున ఏకాగ్రముగాను భ్రాంతిచేత కల్పింప బడి యాత్మకు వేరగు స్థూలపదార్థముల రూపముగా పరిణమించుట కు కారణమైన తమోగుణముచే కలియనందున సూక్ష్మముగానున్న యేర్పడును యిట్టిదశలోనే ఆత్మస్వరూపమును గ్రహించుటకు యోగ్య మై యుండును. గనుకనే॥

శ్రుతి॥ దృశ్యతేత్వగ్రయాబుద్ధ్యా।
సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః॥

తా॥ రజోగుణములేనందున నేకాగ్రమై తమోగుణములేనందు న సూక్ష్మమగుబుద్ధిచేత సూక్ష్మవస్తుదర్శన చతురులగు పురుషులాత్మస్వ రూపమును చూచుచుందురని శ్రుతిచేవినబడుచున్నది॥

కాబట్టి ఓయిశిష్యా ఏప్రకారము హెచ్చుగాలిచే కదిలింపబడు దీపముచేత రత్నములు ముత్యములు మొదలగువాటియొక్క లక్షణము లను నిశ్చయించుటకు శక్యముకాదో ఏప్రకారము గుద్దలిచేత సూది తోకుట్టినట్టు వస్త్రమును కుట్టుటకు శక్యముకాదో నాప్రకారమే ఏకా గ్రముకాక స్థూలమగుబుద్ధిచేత బ్రహ్మతత్వము తెలియుటకు శక్యము గాదు గనుక ఇటువంటి సత్వమే తమోగుణముతోచేరిన రజోగుణము చేత పట్టుకోబడి నానావిధ ద్వయితప్రపంచము నాలోచించి కల్పిం చుటచేత చిత్తమని చెప్పబడినది ఇట్టిచిత్తము తమోగుణము హెచ్చి నప్పుడు అసురసంపదనుపుట్టించుచూ స్థూలదశనొందును ఈయర్థమునే వశిష్టమహాఋషిచే చెప్పబడినది॥

శ్లో॥ అనాత్మన్యాత్మభావేన దేహభావనయాతథా।
పుత్రదారైఃకుటుంబైశ్చ చేతోగఛతిపీనతాం॥

తా॥ ఆత్మగాని దేహేంద్రియాదుల యందాత్మబుద్ధి జేయు టచ్చేతను దేహమునందు వెనుకజెప్పిన శాస్త్రీయగంధాదాన దోషాప నయనములను చేసినపక్షమందాత్మకు శుద్ధిగలుగుననే భ్రాంతచేతను కుటుంబమందుండే పుత్రభార్యాదులయందు మమకారము జేయుటచేత ను చిత్తము స్థూలముగా పెరుగును॥

శ్లో॥ అహంకారవికారేణ మమతామమలీలయా।
ఇదంమమేతిభావేన చేతోఽగ్నతతిపీనతాం॥

తా॥ దేహమందాత్మ బుద్ధిజేయడమనే పరిణామముచేతను దేహేంద్రియాదులయందు చేయబడే మమకారమనే మలినవాసనచేత ను గృహక్షేత్రాదులయందివి నావియనే యభిమానముజేతను చిత్త ముబలియుచుండును॥

శ్లో॥ ఆదివ్యాధివిలాసేన సమాశ్వాశేనసంస్మృతా।
హేయాహేయవిభాగేన చేతోఽగ్నతతిపీనతాం॥

తా॥ మనోవ్యథలు జ్వరాదిరోగములు వీటిప్రకాశముచేతను కర్తృత్వభోక్తృత్వాది రూపమగు నీసంసారమందు నమ్మికకలిగియుం డుటచ్చేతనున్ను ఈవస్తువులు విడువదగినవి ఈవస్తువులు గ్రహింపదగి నవి యనే అభినివేశనముచ్చేతను చిత్తముబలియుచుండును॥

శ్లో॥ స్నేహేనధనలోభేన లాభేనమణియోషితాం।
ఆపాతరమణీయేన చేతోఽగ్నతతిపీనతాం॥

తా॥ పుత్రస్నేహ భార్యాదుయందుండు స్నేహముచ్చేతను ద్రవ్యమందాశచ్చేతను మాణిక్యములు స్త్రీలు మొదలగు వస్తువులయొక్క సమయోచితప్రతిని బుట్టులాభముచ్చేతను చిత్తముబలియుచుండును॥

శ్లో॥ దురాశాక్షీరపానేన భోగానిలభవేనచ।
ఆస్వాదానేనచారేణ చేతోఽగ్నతతిపీనతాం॥

తా॥ ఎప్పటికి తృప్తినిచెందని విషయాశయనే పాలపానము చ్చేతను విషయభోగమనే వాయుభక్షణముచ్చేతను ప్రపంచమందు సత్యత్వబుద్ధిని చేయడమనే విహారముచ్చేతను చిత్తమనేసర్పము మిక్కిలీ బలియుచుండును॥

కాబట్టి ఓయిశిష్యా యికనువాసనాక్షయ మనోనాశములను క్రమముగా నీరూపించుచున్నారము కాబట్టిసావధానచిత్తుండవైవినుము

## ✻ వా స నా క్ష య వి వ ర ణ ము. ✻

శ్లో॥ భంధోహివాసనాభంధో మోక్షస్స్యాద్వాసనాక్షయః।
వాసనా స్త్వంపరిత్యజ్య మోక్షార్థిత్వమపిత్యదా॥ ✻

శ్లో॥ వాసనలచేత భందింపబడుట సంసారమని వాసనలునశిం చుటయే మోక్షమనిన్ని చెప్పబడును గనుక (నోరామా) నీవు వాసనలనన్నిటినీ ముందుగావదలి తరువాత మోక్షేచ్ఛయను వాసననుకూడా వదిలిపెట్టుము॥

వసిష్టమహాఋషి చెప్పియున్నారు॥ వసిష్ట రామాయణమునందు॥

శ్లో॥ మానసీవాసనాపూర్వం త్యక్త్వావిషయవాసనాః।
మైత్ర్యాదివాసనానామ్నీ గృహాణామలవాసనాః॥

తా॥ ఓరామా ముందుగానీ మనస్సునందుండే వాసనలను విషయవాసనలను ఈరెంటిని విడువుము॥ యేప్రకారముగా విడువవలయునంటే చెప్పెదము వినుము॥

మైత్రి ముదితా కరుణా ఉపేక్ష యనుశుభవాసనలను గ్రహించుము అందుచేతనే వెనుకటి వాసనలన్నియు నశించును॥

శ్లో॥ తాఅప్యంతఃపరిత్యజ్య తాభిర్వ్యవహరన్నపి।
అంతశ్శాంతతమస్నేహా భవచిన్మాత్రవాసనః॥

తా॥ మనోబుద్ధులయొక్క వృత్తులు సంకల్ప నిశ్చయములు వీటితో కలిసియున్న యాచిన్మాత్రవాసననుగూడా వదలి ద్రష్టృ దర్శన దృశ్యములనే త్రిపుటిభేదమును మిధ్యాత్వబుద్ధిచేత నిషేధించగా నిషేధించుటకు శక్యముగాని యేపరమాత్మతత్వము మిగులునో అట్టిపరమాత్మతత్వమందు స్థిరసమాధిగలవాడవై తర్వాత నాసమాధినికూడావదలి కేవలబ్రహ్మస్వరూపముగానేయుండుము॥

ఓదయానిధివగు గురుమూర్తీ మీరానతిచ్చిన మైత్రీ కరుణ ముదిత ఉపేక్షలను ఈపుణ్యవాసనలెటువంటివో దయచేసి దెలుపవేయన గురుండు దెల్పుచున్నాడు॥

పాతంజల యోగశాస్త్రమునందు॥

సూత్రం॥ మైత్రీ కరుణా ముదితో పేక్షణాం సుఖ దుఃఖపుణ్యా పుణ్య విషయాణాం భావనా వశ్చిత్త ప్రసాదనం॥

అనిచెప్పియున్నది॥

తా॥ సుఖము దుఃఖము పుణ్యము పాపము అనువానినిగురించిన॥ మైత్రి అనగా స్నేహము కరుణా యనగా దయ ॥ ముదిత యనగా సంతోషము ॥ ఉపేక్ష యనగా ఉదాసీనము అను నీవృత్తులనుఅభ్యాసము చేయుటవలన చిత్తమునకు స్వేచ్ఛకలుగుచున్నది॥

యని పాతంజలమహాముని గారిచే చెప్పబడినది॥

అనగా సుఖించుచున్న సాధువులయందు మిత్రభావము నవలంబింపవలయును దుఃఖించుచున్నవారియందు కనికరము వహింపవలయును పుణ్యముకలవారిచూచి సంతోషించుచుండవలయును పాపులయందు ఉదాసీనుడై యుండవలయును॥

ఇట్లనగా సుఖవంతులనుజూచి అసూయపడకూడదు దుఃఖవంతులజూచి ఉపేక్షతో నుండరాదు॥

పుణ్యవంతులయెడ ద్వేషముచేయందగదు పాపవంతులయొక్క పాపములనుచూచి అనుమోదింపరాదు మరియు వారితోనైనగాని ద్వేషమువహింపరాదు॥

ఇట్లు ద్వేషరాగాదులకు విరోధులైన మైత్ర్యాదులనభ్యాసము చేయుటవలన చిత్తముప్రసన్నమై సంప్రజ్ఞాతసమాధుల కుపయుక్తమగును॥అనగా రాగద్వేషములే చిత్తమును కరిగింపుచున్నది గనుక॥

ఓయిశిష్యా మైత్ర్యాది శుభవాసనలచేత రాగాదులను నిర్మూలనంబుజేయుము అట్లుచేయుటచేత నీచిత్తము ప్రసన్నమై ఏకాగ్రము నొందును॥

ఓయిసుగుణధుర్య తనయందుకలిగియున్న మలినవాసనలనుయెదటివారి తప్పులనువలె చక్కగావిచారించి వాటిని నివర్తింపజేయుటకు తగిన శుభవాసనలను నభ్యసింపవలయును గనుక ఓయిశిష్యా ఇటులే నొకస్మృతియందు చెప్పబడినది॥

శ్లో॥ యథాసు నిపుణశ్శమ్యక్పరదోషేక్షణేరతః ।
తథాచేన్నిపుణః స్వేషు కోనముచ్యేత బంధనా॥

తా॥ మొదటివారియొక్క తప్పులను విచారించుటయందు యెంతచురుకు గలవాడైయుండునో అంతచురుకు తనతప్పులను విచారించే విషయమై వుండెనా అట్టిపురుషుడు ముక్తుడు కావడమునకు సంశయములేదు గనుక ఓయిశిష్యా వేరుపురుషునియందుండి తనవిషయముగా ప్రవర్తించునవి ఈకామక్రోధములుగదా అన్యుడగుపురుషుడు నన్ను నిందించినా అవమానించినా నాకు యేమి హానిలేదని చింతించితివేనిఈ వాసనయు క్షీణించును॥

గనుకనే నీవిషయమందు మహాత్ములచే చెప్పబడినది॥

శ్లో॥ ఆత్మానం యదినిందంతి స్వాత్మానం స్వయమేవహి।
శరీరం యదినిందంతి సహాయాస్తే జనామమ ॥ *

తా॥ నన్ను నిందించుజనులు ఆత్మను నిందించుచున్నారా లేక ఈశరీరమును నిందించుచున్నారా ఆత్మనునిందించిరో వారినివారేనిందించుకొ •చున్నందున నేనావిషయమున వగువ పనిలేదు. ఇకనుశరీరమునునిందించిరో ఈశరీరను నాకు విరోధియగుటవలన దీనిని నిందించుటనాకున్ను అవశ్యకమయ్యే యున్నది. గనుక నీశరీరమును నిందించువారు నాసహాయులుగానే యున్నారు. ఈసహాయులగురించి నేనేల కోపపడవలయునని చెప్పియున్నారు॥

ఇట్లే మరియొక స్మృతియందు చెప్పియున్నది॥

శ్లో॥ నిందావమానావత్యంతం భూషణం యస్యయోగినః ।
ధీవిక్షేప కథంతస్యా వాచాలైః క్రియతేమిహ॥ *

తా॥ అని బ్రహ్మవేత్తయగు నెవనికినింద గాని అవమానముగాని భూషణముగా సంతోషకరమైయుండునో అట్టియోగికి బహుప్రలాపముగలవారిచేత నేలాగున చిత్తవిక్షేపము కలుగజేయబడును. అనగా నిందా అవమానములచేతనే చిత్తవికారముగలుగని వానికి మరియేవిధముచేతను చిత్తము వికారమునొందదని భావము॥

నైష్కర్మ్యసిద్ధియనే గ్రంధమందు.

శ్లో॥ సపరికరే వచనైర్దోష తశ్చావధారితే।
యదిదోషం వదేత్తస్మై కింతత్రోచ్ఛ్రితుర్భవేత్ ॥

తా॥ కరచరణాద్యవయవములతో కూడిన నీశరీరము అనేక దోషములచే నిందింపబడినదని విచారణచేత నిశ్చయింపబడియున్నది. ఇట్టి నిశ్చయింపబడిన దోషములుగల ఈశరీరమునందు ఎవరైనా దోషములను చెప్పితే వారియందేమి నేరముగలదు. వున్నవాటిని వున్నట్టుచెప్పువాడు సత్యవంతుడుగనుక వానియందొక నేరమును తలచకూడదని భావము॥

శ్లో॥ యద్వత్స్థూలే తథాసూక్ష్మే దేహేత్యక్తే వివేకతః।
యదిదోషం వదేత్తాభ్యాం కింతత్ర విదుషోభవేత్॥

తా॥ వివేకముచేత స్థూలదేహమందు ఆత్మాభిమానము విడిచినట్టు సూక్ష్మదేహమందుకూడా ఆత్మాభిమానమును విడిచినట్టైతే ఆదేహములు రెంటియందు యెవరైనా దోషములుచెప్పితే జ్ఞానియగువానికి ఏమిలోభము కలుగును॥

శ్లో॥ శోకహర్షభయక్రోధ లోభమోహ స్పృహాదయః।
అహంకారస్య దృశ్యంతే జన్మమృత్యూ చనాత్మనః॥

తా॥ శోకము, సంతోషము, భయము, కోపము, లోభము, మోహము, యిచ్ఛ, ఉత్పత్తి, మరణము, ఇవియన్నియు అంతఃకరణమునకే గలిగియున్నవి గాని కేవల చిద్రూపుడై సర్వవికారశూన్యుడైన యాత్మకు లేవని యర్థము॥

ఓ శిష్యా అన్యులచే చేయబడు నిందకూడా యోగికి అలంకారముగానుండునని తెలియుము॥

ఇందుకు జ్ఞానాంకుశమనే గ్రంథమందు॥

శ్లో॥ మన్నిందయా యదిజనః పరితోషమేతి నన్వప్రయత్నజ
నితోయమనుగ్రహోమే శ్రేయోర్థినోహిపురుషాః

పరతుష్టిహేతో దుఃఖార్జితాన్యపిధనానిపరిత్యజంతి॥

తా ॥ ఈలోకములో నెవరైనా యొక మనుష్యుడు నన్నునిం దించుటచేత సంతోషమును పొందెపక్షమునకుఅదినాకు జేయకనేలభిం చిన అనుగ్రహమనే తలంచెదను. పుణ్యమును సంపాదించు జనులులోక మునందుండు జనులకు సంతోషమును కలుగజేస్తె తమకు పుణ్యముకలు గునని తాము కష్టపడి సంపాదించిన సొమ్మును ఖర్చుచేసి అన్నసత్ర ములను చలివేంద్రలను చేయించుదురు. చెరువులను బావులనత్రవ్వించు దురు గనుక నేను సొమ్మును కర్చుచేయకపోయినా యేవిధమైనవుపకా రమును జనులకుచేయకపోయినా నన్ను నిందించి నావలనసంతోషము ను పొందుచున్నారు. ఇదియే నాకు మహాపుణ్యము అన్నసత్రాదులను వేసినవారికి వచ్చినఫలము నాకున్ను రాగలదని భావము॥

శ్లో॥ సతతసులభదైన్యే నిస్సుఖేజీవలోకే।
యదిమమపరివాదాత్ ప్రీతిమాప్నోతికశ్చిత్।
పరివదతుయథేష్టం మత్సమక్షంతిరోవా।
జగతిబహుదుఃఖే దుర్లభఃప్రీతియోగః॥

తా ॥ ఈప్రపంచము సర్వదా దుఃఖములనే పొందే స్వభావ ముకలది లేశమైనా సుఖముసంభవించుట చాలా అరుదుగా నుండును యిట్టి ప్రపంచమునందు నన్ను దూషించుటచేత యెవడైనానొకమను ష్యుడు సంతోషమును, సుఖమును, పొందునట్లులయితే ఆమనుష్యుడు నాయెదుటగాని మరుగునగాని తనకిష్టమైనంతసేపు నన్ను దూషించవ చ్చును. నాకుయేమి సంకోచములేదు. యెప్పుడున్ను దుఃఖములననుభ వింపజేయు నీలోకమునందు కొంచెంసేపుఅయినా ఈమనుష్యుడునన్ను నిందించి సంతోషించుట నాకు నిండాసమ్మతము. ఓయిశిష్యా ఇటువలె అవమానముకూడా యోగికి భూషణమేనని చెప్పబడుచున్నది॥

శ్లో॥ తథాచరేత్వై యోగీ సతాంధర్మ మదూషయన్।
జనాయథావమన్యేరన్ గచ్ఛేర్యు ర్నైవసంగతిం॥

తా ॥ బ్రహ్మతత్వజ్ఞానముగల పురుషుడు సత్పురుషులయొక్క ధర్మమును మాషించకుండావుండి లోకమునందుండు జనులు తనను అవమానించి తనతో నేప్రకారము కలయకనుందురో నాప్రకారము సంచరించవలయును. ఓ ఋశిష్యా ఇకను క్రోధమును విడచే వివేకమును చెప్పుచున్నాము వినుము॥

## ——✱ క్రోధ నిరసనము. ✱——

ఈక్రోధము రెండువిధములు తనయందుండి యెదటివారిని బాధించునదియొకటి యెదటివారియందుండి తనను బాధించునది రెండవది॥

ఇందులో మొదటి దానికి నివర్తకమగు వివేక మీప్రకారముగా జెప్పబడినది॥

శ్లో॥ అపకారిణిపశ్చేన కోపేకోపః కథంనతే।
ధర్మార్థకామమోక్షాణాం ప్రసహ్యా పరిపంధిని॥

తా ॥ ఓమిత్రుడా నీకు అపకారముచేసిన నావిషయమైనీవుకోపమును చేయుచున్నావే నీకోపమువిషయమై నీవుయెందుకు కోపము చేయవు. ఈకోపమనేది నీకుధర్మార్థకామ మోక్షములనే పురుషార్థముల నన్నిటిని చెరిపివేయుచున్నది. గనుక నీకోపమే నీకు మహాపకారముచేయుచున్నది. దీనియందు కోపమును చేయుము॥

శ్లో॥ బలాదితోధర్మ యశోధననాశనః
సచేతపార్థ స్వశరీరతాపనః
నచేహనాముత్ర హితాయయస్సతాం
మనాంసికోప స్సముపాశ్రయేత్కథం॥

తా ॥ కోపమనేది ఈలోకమునందు ధర్మమును కీర్తిని ద్రవ్యమును వీటెనన్నిటిని నశింపచేయుచున్నది. తనశరీరమునుకూడా నిప్పులో వేసి కాల్చినట్టు బాధించుచున్నది. ఈలోకమునందుగాని స్వర్గమునందుగాని వీనికి క్షేమమును కలుగచేయునదికాదు. ఇట్టికోపము సజ్జనుల యొక్క మనస్సునందు నేప్రకారము నిలుచును॥

### * రెండవకోపనివారణవివేకము. *

శ్లో॥ నమోస్తుకోపదేవాయ స్వాశ్రయజ్వాలినేభృశం।
కోపస్యమమవైరాగ్య దాయినేదోషబోధినే॥

తా॥ మొదటివానియందుండి నాయందుప్రసరించి నాయందుం డేదోషములను నాకుతెలియచేశి నాకువైరాగ్యమును కలుగజేయుచున్నది గనుక నీకోపమనే అగ్నిదేవుడు నాకుమహోపకారిగానున్నాడు ఇతనికినేను నమస్కరించుచున్నాను అని॥

శ్లో॥ నమేపరాదఃకిమకారణేన్నృణాం।
మదభ్యసూయేశ్యపినైవచింతయేత్।
నైయత్కృతాప్రాగ్భవబంధనిస్కృతి।
స్తతోపరాదః పరమోనుచింత్యతాం॥

తా॥ నేనుయేమిన్నీ తప్పునుచేయలేదే ఈమనుష్యులకు నాయండు నిష్కారణముగా కోపమువెందుకురావలయునని ఆలోచించతగదు పూర్వజన్మమందునేను ఈసంసారబంధము నివర్తించే సదుపాయమును చేసుకోకపోవుటయే అపరాధము ఇట్టిమహా అపరాధమును నేనుచేసియున్నందున వీరికందరికి నాయందుకోపము కలిగినదిగానిష్కారణముగా కలుగలేదని చింతించవలయును॥

కాబట్టి ఓముశిష్యా ఈప్రకారమింద్రియముల వాసనల నిరోధించువానికి వైరాగ్యము దృఢముగా రక్షింపబడును॥

శ్రద్ధాభక్తులుగలవాడై మైత్ర్యాదివాసనలతోకూడి వ్యవహరించుచున్నప్పటికి జనులయొక్క సుఖదుఃఖాది సందర్భములను తనమనస్సులో నాలోచించక నిద్రాప్రమాదము మనోరాజ్యము మొదలైనవాటిని ప్రయత్నపూర్వకముగా శమింపజేసుకొని చిన్మాత్రవాసనను నభ్యసింపవలయును॥

### * చిన్మాత్రవాసనానిరూపణము. *

చిన్మాత్రపురుషుడనగా ఎవడుపరుడోవాడే చిన్మాత్రపురుషుడని తెలియతగ్గది॥

ఓ యిశిష్యా చిన్మాత్రవాసనను నేలాగు అభ్యసింపవలయునంటె చెప్పెదము॥

ఈప్రపంచమంతయు జ్ఞానాజ్ఞానవస్తువులతో చేరి ఏకముగా ప్రకాశించుచున్నది. విచారించగా నేత్రాదింద్రియములు శబ్దస్పర్శాది జడవస్తువులను ప్రకాశింపజేయుటకే నిర్మింపబడినవిగాని చిన్మాత్రుని ప్రకాశింపజేయుటకు నిర్మింపబడలేదు॥

ఇందుకు ప్రమాణము॥

శ్రుతి॥ పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూః।
తస్మాత్పరాఙ్పశ్యతినాంతరాత్మన్॥ (అని)

తా॥ బ్రహ్మ ఈప్రపంచమును సృష్టించునపుడు నేత్రాదింద్రియములను ఆత్మకువేరులగు జడవస్తువులను గ్రహించుటకే నిర్మించెనుగనుక నేత్రాదింద్రియములచేత నీపురుషుడు బాహ్యములగు శబ్దాదిజడవస్తువులనే చూచునుగాని జడముగాని చిద్వస్తువును చూడనేరడని భావము గనుక జడవస్తువులతో సమానముగా చిద్వస్తువుకూడా ప్రకాశించుచున్నదని చెప్పుటకవకాశములేదు॥

అయినా చైతన్యము జడవస్తువులకన్నిటికీ వుపాదానకారణముగానున్నందున జడవస్తువులు ప్రకాశించునప్పుడు వాటికి వుపాదానకారణమగు చైతన్యముగూడా అవర్జనీయముగా ప్రకాశించుచుండును. కారణములేనిది యేవస్తువున్నూ పుట్టనేరదు కారణము ఉపాదనకారణమని నిమిత్తకారణమని రెండువిధములు అందులో యేవస్తువు కార్యరూపముగా ప్రకాశించునో నది ఉపాదానకారణమనియు॥

ఉపాదానకారణము కార్యరూపముగా ప్రకాశించుటకు సాధకమగు వస్తువులు నిమిత్తకారణమనియు వేదాంతులు చెప్పుచుందురు ఇందుకు దృష్టాంతము లోకములో ఘటము కార్యము దీనికి ఉపాదానకారణము మన్ను మృత్తికయేగదాకుండగా ప్రకాశించును మృత్తికఘటరూపముగా ప్రకాశించుట సాదనములుదండ చక్ర శిలాలాదులు ఇదియేనిమిత్తకారణములని చెప్పబడును॥

ఈయుపాదానకారణము పరిణామమని వివర్తమని రెండువిధములు॥

ఇందులో తాను అవస్థాంతరమునుబొంది. కార్యరూపముగా ప్రకాశించునది పరిణామ్యుపాదానకారణమనియు॥ తానుఅవస్థాంతరమునుబొందకయే కార్య్యరూపముగా ప్రకాశించునది వివర్తోపాదానకారణమనిన్ని చెప్పబడును ఇందులో పరిణామమునకుదృష్టాంతము॥

మృత్తిక మొదట పిండాకారముగానుండి తరువాత నిమిత్తకారణములగు దండచక్రకులాలాదులయొక్క వ్యాపారముచేత పృదుబుధ్నోదరాకారమనే యవస్థాంతరమును బొందిగదా ఘటరూపముగా ప్రకాశించును॥

గనుక మృత్తిక ఘటమునకు పరిణామ్యుపాదాన కారణమని చెప్పబడును॥

వివర్తమను॥ రెండవదాని దృష్టాంతము॥ రజ్జువు॥ రజ్జువనగా త్రాడు ఇదికను జీకటిలోనుండునప్పుడు సర్పమువలెప్రకాశించును॥ అయితే ఈత్రాడు మొదట నే యాకారముగానుండెనో సర్పముగా ప్రకాశించునప్పుడును ఆత్రాటియాకారముగానేనుండును ఆకారాంతరము నొందినదిలేదు గనుక రజ్జువు సర్పమునుగూర్చి వివర్తోపాదానమని చెప్పబడును॥

కార్యములగు ఘట సర్పాదులు ప్రకాశించునప్పుడు వుపాదాన కారణములగుమృత్తికరజ్వాదులుకూడా ప్రకాశించుచుండునుగాని ప్రకాశింపకయుండునది లేదు. ఓయిశిష్యా ఈప్రపంచమునకు చైతన్యము వివర్తోపాదానకారణము. చైతన్యము నిత్యనిర్వికారము అయినందున అవస్థాంతరము పొందునదికాదు. అయినా ఆకాశాది ప్రపంచరూపముగా ప్రకాశించుచుండును॥గనుకనే చైతన్యము ఈప్రపంచమునకు వివర్తోపాదానమని చెప్పబడినది॥

శ్రుతి॥ తమేవభాంత మనుభాతిసర్వం।
తస్యభాసాసర్వమిదంవిభాతి॥

తా॥ చిన్మాత్ర స్వరూపుడైన ఈపరమాత్మ ప్రకాశించుచుండగా నాప్రకాశము ననుసరించి ఈజడమగు ప్రపంచమంతయు ప్రకాశించుచున్నది అనగా చైతన్య స్వరూపముయొక్క ప్రకాశమే జడస్వరూపమునందు ప్రకాశించుచున్నదిగాని జడస్వరూపమునకు మరియొక ప్రకాశములేదని॥ తాత్పర్యము॥

గనుక ఓయిశిష్యా ఈచిన్మాత్రమును స్వప్రకాశమని శాస్త్రములచేత బ్రహ్మవేత్తలచేతను నిశ్చయింపబడినది ఈచిన్మాత్రమునే చిత్తమునందు దృఢముగా భావింపవలయును॥

ఈయర్థము వాసిష్ఠరామాయణములో బలిచక్రవర్తి॥

శుక్రాచార్యులయొక్క ప్రశ్నోత్తరప్రతివచనములచేత స్పష్టముగా తెలియబడుచున్నది॥

శ్లో॥ కిమిహాస్తీహ కింమాత్ర మిదంకిమయమేవచ।
కస్త్వంకోహంకఏతేవా లోకాఇతివదాశుమే।

తా॥ ఈప్రపంచమందేమియున్నది ఈప్రపంచమునకు నిమిత్తకారణమేమి ఉపాదానకారణమేద్ది నీవు యెటువంటివాడవు నేనుయెటువంటివాడను ఈభూరాదిలోకములు యెటువంటివి ఈయర్థమును శీఘ్రముగా విస్పష్టముగా చెప్పుము అని బలిచక్రవర్తి ప్రశ్నచేయగా శుక్రాచార్యులు చెప్పుచున్నారు।

శ్లో॥ చిదిహాస్తీతి చిన్మాత్ర మిదంచిన్మయమేవచ।
చిత్త్వంచిదహమేవేమె లోకాశ్చిదితిసంగ్రహః॥ అని॥

తా॥ ఈప్రపంచమందు చిన్మాత్రమేకలదు ఈప్రపంచమునకు చైతన్యమే నిమిత్తకారణము చైతన్యమే ఉపాదానకారణము నీవుచిద్రూపుడవు నేనుచిద్రూపుడనే ఈలోకములన్నియు చిద్రూపములు ఇదియే సర్వశాస్త్రములయందు ప్రతిపాదింపబడిన సారార్థము.

ఓపరమగురో ఇట్టిచిన్మాత్రవాసనను మొదటనే యభ్యాసముచేసినయెడల మలినవాసనలు నివర్తించును గనుక ఇదివరలో చెప్పిన శుభవాసనాభ్యాసము నిరర్థకమను సందేహముగల్గుచున్నదనిన॥

ఓయిశిష్యా మైత్రీకరుణా ముదితాది శుభవాసనల నభ్యసింపక ముందుగా చిన్మాత్రవాసననే యభ్యసించినయెడల దృఢముగానిలువనేరదు॥

ఇందుకు దృష్టాంతము॥ అడుగుభూమిని దృఢముగా చేయక స్తంభములు గోడలను నిలవకట్టి యింటినినిర్మించిన నాగృహమునెట్లు స్థిరముగానుండక కుంగిపోవునో నాప్రకారమే శుభవాసనలభ్యసింపక చిన్మాత్రవాసనను ముందుగా నభ్యసించిన నాచిన్మాత్రవాసన క్రమముగా క్షీణించును॥

ఓయి సుగుణరత్నమా ఈవాసనలనన్నిటిని నొకటిపెట్టనిరాకరించినవాడవైతి వేని ప్రారబ్ధభోగము యనుభవించునపుడు వాసనా సహితుడైన పురుషునికంటే వాసనారహితుడగువానికి విశేషముగలదని వసిష్ఠమహాషిచే చెప్పబడియున్నది॥

శ్లో॥ నిత్యమా పూర్ణతామంత దక్షుబ్ధా మిహాసుందరీం।
అపద్యపి నముంచంతి మహాంతో భాస్కరా ఇవ॥ *

తా॥ వాసనాశూన్య చిత్తముగలవారు చంద్రబింబమువలె సర్వజన మనోహరమైన నిర్వికారమైన పరిపూర్ణభావమును అపత్కాలమందుకూడా చంద్రుడు చల్లదనము విడువనట్లు విడువ నోపరు॥

శ్లో॥ భవిష్య న్నానుసంధత్తే నాతీతం చింతయత్యసౌ।
వర్తమాన నిమేషంతు హసన్నే వానువర్తతే॥ *

తా॥ ఈప్రకారము ప్రారబ్ధప్రాప్తముల్లగు కర్మలు చేయునప్పుడు ముందురాబోయ్యేవాటిని యోచించుటలేదు. గడచినవాటినిచింతించుటలేదు. వర్తమానమందుండు పనులను అనాదరముతో చేయుచుండునని వాసిష్ఠరామాయణములో జనకమహారాజు యిటువంటివిచారము కలవాడై వున్నట్టుగానే వినబడుచున్నది॥

## ※ మనోనాశ ప్రకరణము. ※

ఓయివత్సా వాసనాక్షయ రక్షణార్థమై మనోనాశమునేముఖ్యా

ముగా నభ్యసింపఁబడు. గనుకనే మనస్సునే ముఖ్యముగానశింపజే యదగినదని జనకమహారాజుచే చెప్పబడినది॥

శ్లో॥ సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః।
అస్యసంసారవృక్షస్య మనోమూల మితిస్థితం॥

తా॥ అనేకవేల మొలకలు కొమ్మలు ఫలములు చిగుళ్లు పుష్పములుకలిగి వృద్ధినొందుచున్న ఈసంసారవృక్షమునకు మనస్సేదిమూలమని తెలియదగినది॥

శ్లో॥ సంకల్పమేవ తన్మన్యే సంకల్పోపశ మేనతత్।
శోషయామి యథాశోష మేతిసంసార పాదపః॥

తా॥ మనస్సును సంకల్పమనే తలచెదను. సంకల్పమునుశమింపజేసి మనస్సును శోషింపజేసెదను మనస్సు శోషించగానే సంసారవృక్షము శోషించి క్రమముగా నశించును॥

శ్లో॥ ప్రబుద్ధోస్మి ప్రబుద్ధోస్మి దృష్టశ్చోరో మయాత్మనః।
మనోనామ నిహన్మ్యేనం మనసాస్మి చిరంహతః॥

తా॥ నేను నిశ్చయముగా తెలుసుకున్నాను. నన్నుదొంగలించుకొనిపోవు మనస్సనే దొంగవానిని జూచినాను ఈదొంగవానిని నికను చంపివేయుదును. ఈమనస్సుచేతనే చిరకాలమునుంచి బాధింపబడితిని॥

ఓ౦ుశేష్యా వసిష్ఠమహాముని చేతగూడఈయర్థము చెప్పబడినది॥

శ్లో॥ అస్యసంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః।
ఉపాయ ఏకఏవాస్తి మనసస్స్వస్య నిగ్రహః॥

తా॥ సమస్తమైన ఉపద్రవములను కలుగజేయు సంసారమనే ఈవృక్షమును నశింపజేయుటకు తనయొక్క మనస్సును నిగ్రహించుట యొకమంచి యుపాయము మరియొక యుపాయము సంసారవిషవృక్షమును నశింపజేయుటకులేదు॥

శ్లో॥ తావన్నిశీథ వేతాళా వల్గంతి హృదివాసనాః।
ఏకతత్వ దృఢాభ్యాసా ద్యావన్న విజితంమనః॥

తా ॥ ఎంతవరకు అద్వితీయ బ్రహ్మతత్వ మభ్యసించి మనస్సునిగ్రహింపబడదో అంతవరకు కామక్రోధాది మలినవాసనలు అర్ధరాత్రమునందు పిశాచములవలె హృదయమునందు విహరించుచుండును. నిగ్రహింపబడినతర్వాత సూర్యోదయమునకు తర్వాత పిశాచములుపరుగెత్తిపోవునట్లు మలినవాసనలన్నియు నివర్తించును॥

శ్లో॥ ప్రక్షీణచిత్త దర్పస్య నిగృహీతేంద్రియ ద్విషః।
పద్మిన్య ఇవ హేమంతే క్షీయంతే భోగవాసనాః॥

తా ॥ చిత్తముయొక్క యావద్గర్వమును నశింపజేసి ఇంద్రియములనే శత్రువులగెలిచి స్వాధీనములోనుంచుకున్న పురుషునకు హేమంత ఋతువునందు తామరతీగెలవలె విషయభోగవాసనలునశించిపోవును

శ్లో॥ హృదయబిలే కృతకుండలఉల్బణ కలనావిషోమనోభు
జంగః। యస్యోపశాంతి మగమచ్చంద్రవ దుదితుమవ్య
యాంవదే॥ *

తా ॥ హృదయమనే పుట్టలో చుట్టచుట్టుకొనియుండి సర్వానర్థకల్పనయను విషమును గ్రక్కుచుండే మనస్సర్పము ఎవనికి నశించిపోయెనో అతను చంద్రబింబమువలె దినదినమును అభివృద్ధిజెందుచుండును. ఎప్పటికి వినాశము లేకయుండును. అట్టిమహానుభావునికొరకు నమస్కరించెదను॥

శ్లో॥ చిత్తంనాభిః కిలాస్యేదం మాయాచక్రస్య సర్వతః।
స్థీయతేచే త్తదాక్రమ్య తన్నకించిత్ ప్రభాధతే॥ *

తా ॥ మనస్సు మాయయనే చక్రమునకు నాభివంటిది అనగా కుండవంటిది. ఇట్టి మనస్సును బిగబట్టివుంచే కుండను గట్టిగా పట్టివుంచే చక్రము తిరుగునట్టు మాయయే అనర్థమును జేయజాలదు॥

ఓయిశిష్యా గౌడపాదాచార్యులవారున్ను యీయర్థమును చెప్పియున్నారు॥

శ్లో॥ మనసోనిగ్రహాయత్త మభయం సర్వయోగినాం।
దుఃఖక్షయః ప్రబోధశ్చా ప్యక్షయా శాంతిరేవచ॥

తా॥ సకలమైన యోగులకు విదేహకైవల్యము సర్వదుఃఖక్ష యము బ్రహ్మతత్వజ్ఞానము జీవన్ముక్తి ఇవియన్నియు మనోనిగ్రహముచే తనే కలుగుచున్నవి. గనుక మనస్సును ముఖ్యముగా జయించి స్వాధీన పరచుకోవలెను॥

భగవద్గీతలయందు అర్జునునిచేతకూడా చెప్పబడినది॥

శ్లో॥ చంచలం హిమనఃకృష్ణ ప్రమాధి బలవద్దృఢం।
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరి వసుదుష్కరం॥

తా॥ మనస్సు స్వభావముతోడనే మిక్కిలి చపలమైనది. దే హేంద్రియాదులను నిండా క్షోభింపజేయునదిన్ని విచారముచేతకూడా జయించుటకు అశక్యమైనదిన్ని విషయవాసనలతో చుట్టబడియున్నందు న బేదింప శక్యముగానిదిన్ని గనుక న్నాకాశమునందు సంచరించు వా యువును బంధించుట కేప్రకారము శక్యముగాదో నాప్రకారమే మన స్సునుకూడా ప్రతిబంధించుటకు శక్యముగాదు॥

యీవాక్యము హఠయోగముచేత మనస్సును నిగ్రహించుటకుశ క్యముగాదని చెప్పుచున్నది. గనుక మృదుయోగముచేత మనస్సు నిగ్ర హింపబడును॥

ఓయిశిష్యా యీయర్థమునే వసిష్ఠమహాఋషిచేతచెప్పబడినది॥

శ్లో॥ ఉపవిశ్యోప విశ్యైక చిత్తకేన ముహుర్ముహుః।
నశక్యతే మనోజేతుం వినాయుక్తి రునిందితాం॥

తా॥ సర్వజన స్పృహణీయమైన మంచియుపాయములేకనే స్థిరమైన పద్మకాద్యాసనముల కూర్చొని మాటిమాటికి నేకతత్వాభ్యా సముచేయుటచేత మనస్సు జయింపబడదు. మృదువైన ఉపాయముచే తజయింపబడును॥

శ్లో॥ అంకుశేన వినామత్తో యధాదుష్ట మతంగజః।
విజేతుం శక్యతేనైవ తధాయుక్త్యా వినామనః॥

తా॥ మదించినయేనుగ అంకుశములేకుండా కేవలబలాత్కా

రముచేతనే ప్రకారము స్వాధీనముకానేరదో నాప్రకారమే ఉపాయములేక కేవలహఠయోగముచేత మనస్సు స్వాధీనము కానేరదు॥

ఓయిసుగుణధుర్యా మనోజయమునకు కొన్నికారణములను వసిష్ఠమహాముని చెప్పియున్నారు ఆకారణముల ననుష్ఠించువారికి మనస్సు స్వాధీనమయి యుండును॥

శ్లో॥ హఠతోయుక్తితశ్చాది ద్వివిధోవిగ్రహోమతః।
నిగ్రహాద్ధీక్రియాత్మానాం హఠోగోళకనిగ్రహాత్॥

తా॥ మనస్సును నిగ్రహించుటకు హఠమని యుక్తియని రెండు సాధనములుకలవు ఇందులో జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ములయొక్క గోళములను నిగ్రహించుటచ్చేత ఆయానింద్రియముల నిరోధించుట హఠమని చెప్పబడును ముందుచెప్పబొవ్వే సాధుసంగమాద్యుపాయముల చేత నింద్రియముల నిరోధించుట యుక్తియనంబడును॥

శ్లో॥ కథాచిజ్జాయతేకశ్చి న్మనస్తేనవిలీయతే॥

తా॥ ఈరెండుసాధనములలో నొకపురుషునకొక సాధనము సంభవించును దానిచేతనే మనస్సులయమునొందును॥

శ్లో॥ అధ్యాత్మవిద్యాధిగమః సాధుసంగమఏవచ।
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పంధనిరోధనం।
ఏతాస్తాయుక్తయఃపుష్టాః సంతిచిత్తజయేకిల॥

తా॥ వేదాంతశాస్త్రగ్రంథములను చదువుకొనుట సత్పురుషులతోటి సహవాసముచేయుట కామక్రోధాదివాసనలను విడుచుట ప్రాణవాయువును స్మార్తప్రాణాయామముచేతనిరోధించుట ఇవిమొదలైనయుక్తులు చిత్తమును స్వాధీనపరచుకొనుటకు చాలాకలవు॥

స్మార్తప్రాణాయామమనితాంత్రికప్రాణాయామని రెండువిధముల ప్రాణాయామములుగలవు పాతంజలశాస్త్రమునందు చెప్పబడిన ప్రాణాయామము తాంత్రికమనబడును అదిహఠయోగాంగము స్మార్తప్రాణాయామమనగా మన్వాదిధర్మశాస్త్రములయందు చెప్పబడినది॥

శ్లో॥ సవ్యాహృతింసప్రణవాం గాయత్రీంసిరసాసహ।
త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామస్సఉచ్యతే॥

తా॥ శ్వాసప్రశ్వాసములనిరోధించి గాయత్రీమంత్రమును ప్రణవముతోటి సప్తవ్యాహృతులతోటి సిరసుతోటి స్నిమూడుపర్యాయములు పఠించవలయును॥

ఇదియొకప్రాణాయామము॥

ఓయి వివేకరత్నమా ఇట్టిప్రాణాయమము సంధ్యావందనాది నిత్యకర్మములకంగము ఇచ్చటచిత్తజయోపాయములలో చెప్పబడిన ప్రాణస్పంధ నిరోధమనునది స్మార్తప్రాణాయామమని తెలియదగినది॥

శ్లో॥ సతీషుయుక్తిష్వేతాసు హఠాన్నియమయంతియే।
చేతస్తేదీపముత్సృజ్య వినిఘ్నంతితమోంజనైః॥

తా॥ చిత్తమును జయుంచుటకు ఈలాగంటియుక్తులు అనేకములున్నప్పటికిని వీటిని ఉపేక్షించి హఠయోగముచేతనే చిత్తమును స్వాధీనపరుచుకొనుటకు యెవరుయత్నమును చేయుదురో వారు దీపమునువిడచికాటుకచూర్ణముచేత నంధకారమును నివర్తింపజేయునట్టివారు అనగా మృదుయోగముచేత చిత్తమును సులభముగా స్వాధీనపరుచుకొనుటకు శక్యమైయుండుననిభావము॥

శ్లో॥ విమూఢాఃకర్తుముద్యుక్తాః యేహఠాచ్చేతసోజయం।
తేనిబధ్నంతినాగేంద్ర మున్మత్తంబిసతంతుభిః॥

తా॥ ఏపురుషులు హఠయోగముచేత చిత్తమును జయుంచుటకు యత్నించెదరో వారు మదించిన యేనుగను తామరకాడలోనున్న దారముచేత కట్టివేయతలచిన మూర్ఖులనిచెప్పబడుదురు॥

ఓయివత్సా॥ హఠనిగ్రహమని క్రమనిగ్రహమని నిగ్రహము రెండువిధములు జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను ఆయాగోళములను నిరోధించుటచేత అనగా కండ్లుమూయుట నోరుమూయుట మొదలగు వాటిచేత నిరోధించినట్లు చిత్తమునుగూడా నిగ్రహించవలెనని మూర్ఖుడగువానికి భ్రాంతికలుగును గాని అప్రకారము చిత్తముహూ

యబడదు చిత్తముయొక్క గోళము హృదయము ఆదళశరీరములోపల నాభికి మీద జానెడెత్తున కంఠముయొక్క యెముకకు క్రిందుగానుండు ను యెనిమిదిదళములుగల తామరపుష్పమువలెనుండి అధోముఖముగా వ్రేలాడుచుండును ఇట్టిహృదయము మాయుటకుశక్యముగా నుండదు గనుక గోళనిరోధముచేత చిత్తనిరోధముశక్యముకానేరదు గనుక ఓ యిశిష్యా క్రమనిగ్రహామే చిత్తనిరోధమునకు యోగ్యమయిన యు పాయము॥

ఓయిశిష్యరత్నమా అందులోకూడా వేదాంతశాస్త్రశ్రవణా దులే ముఖ్యోపాయములు. వేదాంతశ్రవణముచేత దృశ్యప్రపంచము మిథ్యయని. దృక్కనిచెప్పబడే స్వప్రకాశ చిద్రూపము సత్యమని తెలి యబడును అందుచేత తనకుగోచరించే విషయములగ్రహించుటవలన ప్రయోజనములేదనిన్ని ప్రయోజనముగల చిద్రూపపరమాత్మ కనుపిం చదని తెలిసిన ఇంధనములులేని అగ్నివలె చిత్తము తనంతటతానే క్షీణించిపోవును. ఈయర్థము శాస్త్రములలో వినబడుచున్నది॥

శ్లో॥ యథానిరింధనోవహ్నిః స్వయోనావుపశామ్యతి॥
తథావృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥

తా॥కట్టెలులేని అగ్ని స్వకారణమైన గాలిలోఎట్లులయమవునో నాప్రకారమే వృత్తులునశించిన తరువాత చిత్తము. స్వకారణమయిన పరమాత్మయందు లయమునొందును॥

ఓయిశిష్యా వేదాంతశాస్త్రశ్రవణముచేత తత్వజ్ఞానముకలిగి నప్పటికి ఎవనికి అజ్ఞానము మరుపునుబొందుచుండునో వానికి సజ్జన సహవాసమే చిత్తజయోపాయము. సత్పురుషులగువారు తత్వమును మరువకుండా మాటిమాటికి బోధించుచుందురు. ఏపురుషుడు విద్యా మద ధనమదములచేత గర్వించి సత్పురుషుల చెంతజేరుటకు సంతోషిం పడో వానికి వెనుకచెప్పిన వాసనాక్షయము నభ్యసించుటయే మనో జయోపాయము. వాసనలు నిండాప్రబలమైనందున నెవనికివిడుచుటకు

శక్యముల్తైయుండవో వానికి ప్రాణాయామముచేత ప్రాణవాయువును నిరోధించుటయుపాయము॥

ఓయిశిష్యా ప్రాణవాయువుయొక్క చలనము వాసనలు ఈ రెండు చిత్తమును ప్రవర్తింపచేయుచుండును గనుక వీటిని నిరోధించుటచేత చిత్తము శాంతించును ప్రాణస్పందము వాసనలు ఈరెండు చిత్తప్రవర్తకములని వసిష్టమహామునిచే చెప్పబడినది॥

శ్లో॥ ద్వేబీజేచిత్తవృక్షస్య వృత్తివ్రతతిధారిణః।
ఏకంప్రాణపరిస్పంధః ద్వితీయంధృఢవాసనా॥

తా॥ చిత్తమనేవృక్షము వృత్తులనే తీగెలతోచుట్టబడియున్నది ఇట్టివృక్షమునకు రెండువిత్తనములుగలవు అందులో నొకటి ప్రాణవాయుస్పంధము రెండవది ధృఢమగువాసనలు॥

ఓయిశిష్యా కమ్మరవాండ్లు నివురుకప్పిన అగ్నిని తిత్తులతోనేప్రకారముగా నూదుదురో నూదగా పుట్టినవాయువుచేత అగ్నియెట్లుజ్వలించునో నాప్రకారమే చిత్తమునకు ఉపాదానకారణమయిన అజ్ఞానముచేత నావరింపబడిన జ్ఞానము ప్రాణస్పంధముచ్చేత బోధింపబడి చిత్తవృత్తిరూపముగా ప్రజ్వలించును ఆచిత్తవృత్తియని చెప్పబడేజ్ఞానజ్వాలరూపమగు సంవేదనమువలన దుఃఖములు పుట్టుచుండును ఇదియే ప్రాణస్పందమనే బీజముచేత చిత్తము పుట్టుప్రకారము॥

ఓయిశిష్యా ధృఢముగా అభ్యసింపబడిన శబ్దాదివిషయములను ముఖ్యముగా భావించుటచేత మహాచపలమైన చిత్తపిశాచముజన్మించును ఈచిత్తమే జన్మ జరామరణాది సంసారమునకు కారణమైయుండును. ఓయిశిష్యా వాసనలచేత ప్రాణస్పందము. ప్రాణస్పందముచేత వాసనలు ప్రవర్తించుచుండును. ఇదియేచిత్తబీజమునకు బీజాంకురన్యాయము॥

ఇదియు వసిష్టమహర్షిచె చెప్పబడినది.

శ్లో॥ ద్వేబీజేచిత్తవృక్షస్య ప్రాణస్పందనవాసనే।
ఏకస్మిన్‌క్షీణయోక్షీణే క్షిప్రంద్వేఅపినశ్యతః॥

తా॥ చిత్తవృత్తమునకు ప్రాణస్పందమనివాసనలని రెండువిత్తనములుగలవు వాటిలోనొకటి నశించినా రెండును నతిశీఘ్రముగా నశించును. ప్రాణస్పందవాసనలు నశించేవుపాయము. తర్వాత కలిగేఫలమున్ను వసిష్టమహాముని చే చెప్పబడినది॥

శ్లో॥ ప్రాణాయామ దృఢాభ్యాసై ర్యుక్త్యాచ గురుదత్తయా ।
ఆసనాసనయోగేన ప్రణాస్పందో నిరుధ్యతే॥ ❋

తా॥ రేచక పూరక కుంభక ప్రాణాయామములను దృఢముగా నభ్యసించుటవలన గురువుచే చూపింపబడిన యుక్తివలన సుఖాసనము మితాహారము పుచ్చుకొనుటవలన ప్రాణవాయువుయొక్క చలనము నిరోధింపబడును॥

శ్లో॥ అసంగ వ్యవహారిత్వా ద్భవభావన వర్జనాత్ ।
శరీరనాశ వర్తిత్వా ద్వాసనాన ప్రవర్తతే॥ ❋

తా॥ లౌకిక వైదిక కర్మమునను ష్ఠించునపుడు కర్తృత్వాభిమానము ఫలాభిలాషయును లేకుండా వ్యవహారించుటవలన సాంసారిక ఫలముల నాలోచించక పోవుటవలన శరీరము నశించునని విచారించుటవలన వాసనలు ప్రవర్తించక నిలచిపోవును॥

శ్లో॥ వాసనాసం పరిత్యాగా చిత్తంగఛత్య చిత్తతాం।
ప్రాణస్పంద నిరోధాచ్చ యథేచ్ఛసి తథాకురు॥

తా॥ వాసనలను విడుచుటవలనగాని ప్రాణవాయునిరోధమువలనగాని చిత్తమునశించును. ఓరామా ఈరెంటిలో నీకుదేనియందురుచికలదో దానినిచేయుము॥

శ్లో॥ ఏతావన్మాత్రకంమన్యే రూపంచిత్తస్య రాఘవ ।
యద్భావనం వస్తునోంత ర్వస్తుత్వేన రసేనచ॥ ❋

తా॥ శబ్దాది పదార్థములను వాస్తవములని సుఖరూపములని హృదయమందు భావించుటయే చిత్తమనితలచెదను ఇంతకు వేరైనరూపము చిత్తమునకున్నట్టు కనుపడదు॥

శ్లో॥ యదాన ధ్యాత్వతేకించి ద్ధేయోపాదేయ రూపియత్।
ధీయతే సకలంత్యక్త్వా తథాచిత్తం నజాయతే॥ *

తా॥ పురుషునకు విడువదగు కంటకాది పదార్థములను పొం దదగు చందనాది పదార్థములను అన్నిటిని నాలోచించుటలేక నేసర్వము నువిడచి యెప్పుడువుండునో అప్పుడు చిత్తము జన్మించకయుండును॥

శ్లో॥ అవాసనత్వాత్ సతతం యధాన మనుతేమనః।
అమనస్తా తదోదేతి పరమోప శమప్రదా॥ *

తా॥ వాసనలు లేకపోవుటవలన మనస్సుయెప్పుడు విషయము ల నాలోచించక యుండునో అప్పుడు సర్వాధికమైన శాంతి కలుగజే యు అమనస్కత కలిగెనని తెలియవలయును॥

ఓ పరమగురో॥ శ్రుతి॥ ప్రాణాః ప్రపీడ్య॥

యనుశ్రుతియందు ప్రాణముక్షయించుట యనగా మరణమే గ దా. అట్టి మరణదశలో శ్వాసము కనుబడుటలేదు. శ్వాసము కనుబ డుచుండగా ప్రాణము క్షీణించుటలేదను ఈసంశయము నివర్తిచేయ దేవరవారే కర్తలని వేడుకొనెన॥

ఓయిశిష్యా ప్రాణముయొక్క క్షయమనగా అధికముగ ప్రవ ర్తించకపోవుటయేగాని సుతరాం నాశముకాదు॥

భూమిని త్రవ్వువానికి చెట్టును కొట్టువానికి పర్వతమునెక్కు వానికి బహుదూరము పరుగిడువానికి యెంత శ్వాసవేగము కలిగియుం డునో అంతవేగము నెమ్మదిగా కూర్చున్నవానికి యేప్రకారము వుండ దో ఆప్రకారమే ప్రాణాయామము నభ్యసించువానికి స్వల్పమైనశ్వాస ము కల్గియుండును॥ కాబట్టి ఓయిశిష్యా॥

గృహస్థులకు పద్మాసనమే ముఖ్యము. కావున గురునివలన తెలి యునది. అయితే విద్యామద ధనమదాది మలినవాసనలులేనివానికిధ్యా నాభ్యాసము సుకరమై యుండును. ఆ విద్యా ధనమదాదులు గలవానికి ప్రాణాయామ అభ్యాసము చేయవలసియుండును. ఈ ప్రాణాయా

మాభ్యాసము ఆచార్యుని మూలముగా తెలియదగుననిన:—ఓస్వామీ యోగమెటువంటిదో దెలుపవేయన గురుండిట్లనియె॥

## ✱ యోగప్రకరణము. ✱

పాతంజలమహాముని॥ సూ॥ యోగశ్చిత్తవృత్తినిరోధః॥

తా॥ అంతఃకరణవృత్తులనునిగ్రహించుటయేయోగమనంబడును॥

సూ॥ తదాద్రష్టుః స్వరూపేవస్థానం॥

తా॥ చిత్తవృత్తులు నిగ్రహమైయుండు కాలమునందు చిన్మాత్రుడైనపురుషుడు నిజస్వరూపమునందుండుటవలన సంభవించుచున్నది॥

ఓ యిశిష్యా పురుషునకు జ్ఞానమే స్వరూపము॥

బుద్ధియనెడు వస్తువునందు జ్ఞానము సంక్రమించెనేని బుద్ధితత్వము పనులనుజేయును. పురుషుడెప్పుడునుసంసరణమందుచిక్కనివాడు॥

సూ॥ వృత్తి సారూప్యమితరత్ర॥

తా॥ యోగములేని కాలమందు ఆత్మ వృత్తులయొక్క సమానస్వరూపమును బొందియుండును॥

సూ॥ వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః॥

తా॥ క్లేశములుకలవియు క్లేశములులేనివియునగు చిత్తవృత్తులైదువిధములు. అనగా దుఃఖములకు కారణములైనవి క్లిష్టములనియు సుఖములకు కారణములైనవి అక్లిష్టములని యెరుగవలయును॥

సూ॥ తత్రస్థితౌ యత్నోఽభ్యాసః॥

తా॥ చిత్తవృత్తులను లయింపజేయుటకును చిత్తైకాగ్రతను కలుగజేయుటకును ప్రయత్నపడునట్లుజేయుట అభ్యాసమనబడును॥

సూ॥ సతుదీర్ఘకాల నైరంతర్య సత్కార సేవితో దృఢభూమిః॥

తా॥ ఆయభ్యాసము బహుకాలమువరకు ఎడతెగక ఆదరాతిశయముతో సేవింపబడినందున స్థిరమైన అవస్థకల్గును॥

సూ॥ తత్పరం పురుషఖ్యాతే ర్గుణవైతృష్ణ్యం॥

తా॥ త్రిగుణములయందలి యాశలేకుండటయే గుణవైరాగ్యము. ఇది విషయ వైరాగ్యముకన్నను శ్రేష్ఠము

సూ॥ దృష్ట్రృశ్యయో సంయోగో హేయహేతుః॥

తా॥ దృష్ట్రృశ్యముల సంయోగమే దుఃఖములకు కారణము॥

అనగా చిన్మాత్రుడైన పురుషునకును బుద్ధితత్వమునకునుఅజ్ఞాన మూలకముగా గలిగిన సంబంధము గుణపరిణామ రూపమైనదుఃఖము నకు కారణమై యున్నది॥

చిన్మాత్రుడైన లేక సాక్షిభూతుడైన పురుషుడు ద్రష్ట లేక ఆత్మ యనియు జెప్పవచ్చును॥ బుద్ధి॥ దృశ్యము॥

దృశ్యమనగా। చూడబడునది॥

ద్రష్టయనగా। చూచునది॥

ఈబుద్ధి ఆత్మలయొక్క సంయోగము సంసారమునకును దుఃఖమునకును కారణము॥ సూత్రము॥

యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయోష్టా వంగాని॥

తా॥ యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణము ధ్యానము సమాధి అనునివియెనిమిదియుయోగమునకు అంగము లనబడును॥

సూ॥ అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాయమః॥

తా॥ ప్రాణులను హింసచేయకుండుట మనఃపూర్వకముగా సత్యముబలుకుట పరులసొత్తు అపహరించకుండుట ఇంద్రియనిగ్రహము భోగసాధన పదార్థముల గైకొనకుండుట ఈయైదున్నుయమము॥

ఈయమము సర్వకాల సర్వావస్థలయందు తప్పక అనుష్ఠించుచుండవలెను॥

సూ॥ సంతోషతపస్వాధ్యాయే శ్వరప్రణిధానాని నియమః॥

తా॥ శుచిత్వము సంతోషము తపము స్వాధ్యాయము ఈశ్వరభక్తి ఇవియైదున్ను నియమము లనబడును॥

సూ॥ తత్సన్నిధౌ వైరత్యాగః॥ అహింసా॥

తా॥ ఈఅహింసాభ్యాసము చేయుయోగి నివసించుస్థలమందు గోవ్యాఘ్రములు గజసింహములు మొదలగునవికూడా వైరము విడచి తిరుగును॥

సత్యము॥ సూ॥ సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం॥
తా॥ సత్యమునభ్యాసము కలవాడు పుణ్యకర్మలు చేయకపోయినను ఆయోగికి ఆయాకర్మల ఫలములు లభించును॥
దొంగతనము॥ సూ॥ అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం॥
తా॥ దొంగతనము చేయకుండువానికి సమస్తరత్నములును ప్రాప్తించును॥

బ్రహ్మచర్యము॥ సూ॥ బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః॥
తా॥ బ్రహ్మచర్యవ్రతమువలన బ్రహ్మవర్చస్సు లభించును॥
అపరిగ్రహము॥ సూ॥ అపరిగ్రహస్థైర్యే జన్మకథంతా సంబోధః॥

తా॥ భోగసాధనవస్తువులను స్వీకరించని వానికి పూర్వజన్మములందు తానేలాగుంటెనసెడు జ్ఞానముప్రాప్తించును॥

శౌచము॥ సూ॥ శౌచాత్స్వాంగజిగుప్సాపరైర సంసర్గః॥
తా॥ శుచిత్వమునభ్యసించుటవలన అసహ్యాను ఇతర సంబంధము కూడదను రెండువిధములు ప్రాప్తించును॥
శుచిత్వము॥ సూ॥ సత్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేంద్రియ జయాత్మదర్శన॥ యోగ్యత్వానిచ॥
తా॥ శుచిత్వమువలన సత్వబుద్ధియును దీనివలన సౌమనస్యమును దీనివలన చిత్తైకాగ్రతయును దీనివలన ఇంద్రియ జయమును దీనివలన ఆత్మదర్శనజ్ఞానమును కలుగును॥

సంతోషము॥ సూ॥ సంతోషాదను త్తమసుఖలాభః॥
తా॥ సంతోషాతిశయమువలన నిరతిశయమైన ఆనందముకలుగును॥
తపస్సు॥ సూ॥ కాయేంద్రియసిద్ధి రశుద్ధిక్షయా త్తపసః॥
తా॥ తపస్సుచేయుటవలన చిత్తమునందలిమలినము తొలంగు

చున్నది అందువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు అద్భుతశక్తికలుగుచున్నది॥

స్వాధ్యాయము॥ స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః॥

తా॥ తనకు ఇష్టమయిన మంత్రము జపించుటవలన తానుకోరినదేవత ప్రత్యక్షమగును॥

ఈశ్వరప్రణిధానము॥ సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానం॥ సూత్రం॥

తా॥ పరమేశ్వరునియందు అతిశయమైన భక్తిచేయుటవలన సంప్రజ్ఞాతసమాధిలాభము కలుగును॥

ఆసనము॥ సూత్రము॥ స్థిరసుఖమాసనం॥

తా॥ ఆసనములు స్థిరమై సుఖమైయుండదగినవి ॥

ప్రాణాయామము ఇంతకుముందు చెప్పబడినది॥

ధారణ॥ సూ॥ ధారణాసు యోగ్యతామనసః॥

తా॥ ధారణవలన చిత్తమునకు స్థైర్యముకల్గును॥

ప్రత్యాహారము॥ సూ॥ స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః॥

తా॥ ఇంద్రియములను తమవిషయములయందు బోనీయక నిర్మలచిత్తమునకు మరల్చి తమతమ స్థానమున నిల్పుటయే ప్రత్యాహారము॥

ఈప్రత్యాహారాభ్యాసమువలన ఇంద్రియములు స్వాధీనమగును॥

ఓగురుస్వామీ॥ ధ్యానసమాదులు యెటువంటివో కరుణించి తెలుపవేయన ఓయిశిష్యా ధ్యానమనగా ఏదేశమందు చిత్తమును ధారణచేయబడెనో ఆదేశమునందు జ్ఞానము ఏకతానమై యుండుట ధ్యానమనబడును. అనగా ఇతరవిషయములను గ్రహించక పరమాత్మనే చిత్తవృత్తిచేత గ్రహించుట ధ్యానమని యభిప్రాయము॥

ఓయిశిష్యా సమాధియనగా ఇట్టిధ్యానము మధ్యేమధ్యే విచ్ఛేదములేక చిరకాలము ఏకవిషయమందుండుటయే సమాధియనబడును. గనుక ఓయిశిష్యరత్నమా ఈధ్యానసమాధుల రెంటిని సర్వానుభవయోగియనే॥ ఆచార్యులు విశదముగా చెప్పియున్నారు॥

శ్లో॥ విలాప్యవికృతింకృత్స్నాం సంభవవ్యత్యయక్రమాత్।
పరిశిష్టంచసన్మాత్రం చిదానందంవిచింతయేత్॥

తా॥ దేహేంద్రియాది వికారప్రపంచమును సర్వమును ఉత్ప త్తిక్రమమునకు విపరీతక్రమముగా లయింపజేసి శేషించిన జ్ఞానానంద స్వరూపమగు సన్మాత్ర బ్రహ్మానుచింతించవలయును ఇదియే ధ్యానమని చెప్పబడును॥

శ్లో॥ బ్రహ్మాకారమనోవృత్తి ప్రవాహోహంకృతింవినా।
సంప్రజ్ఞాతసమాధిస్స్యాత్ ధ్యానాభ్యాసప్రకర్షతః॥

తా॥ సచ్చిదానంద బ్రహ్మాకారముగా పరిణమించిన చిత్తవృ త్తి ప్రవాహము అహంకారము లేకుండా ప్రవర్తించెనా సంప్రజ్ఞాత సమాధియని చెప్పబడును ఈసమాధిధ్యానమును విశేషముగా నభ్యా సించినందున కలుగును॥

ఓయిశిష్యా॥ ఈసమాధి రెండువిధములు॥ లయపూర్వకస మాధియనియు బాధపూర్వకసమాధియనియు ద్వివిధము. లయపూ ర్వకసమాధి పాతంజల మతమునననుసరించి॥ బాధపూర్వకసమాధి బ్రహ్మవాదిమతము ననుసరించి చెప్పబడినది॥

సూత్రము॥ తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః॥

తా॥ బ్రహ్మకార్యమగు నీప్రపంచము బ్రహ్మకంటెభిన్నమైనది కాదు॥

ఇందుకు॥ శ్రుతి॥ వాచారంభణంవికారోనామధేయం॥

అనేశ్రుతిచెప్పుచున్నది॥ కార్యము కారణముకంటే భిన్నము కాదని యుక్తిచేతకూడా కనుబడుచున్నదని సూత్రార్థము॥

ఓయిశిష్యా ఈన్యాయముచేత కారణముకంటె భిన్నమగు కా ర్యములేదుయని స్పష్టముగా తెలియబడుచున్నది॥

ఓయిశిష్యా ఈసర్వప్రపంచము మాయకంటే భిన్నముగాలేదు ఆమాయయనే కారణము జడమయినందున చిద్రూపుడగు పరమేశ్వరు నియందారోపింప బడినందున పరమేశ్వరునికంటే భిన్నముగాలేదని

యమసంధించుటచేత కార్య కారణాత్మకమయిన నీప్రపంచమునం దు చైతన్యస్వరూపుడగు పరమేశ్వరునిమాత్రము గోచరింపజేయు స మాధి లయపూర్వకసమాధియని చెప్పబడును. ఈసమాధియందు త త్వమస్యాది మహావాక్యార్థజ్ఞానము లేనందున అవిద్యాది కారణము లున్నందున యావత్ప్రపంచమునకు తిరుగ పుట్టుక కలుగునుగాన ఇది సబీజసమాధియని చెప్పబడును ఇందుచేతనే ఇదిముఖ్యసమాధికాదు॥

ఓయిశిష్యా తత్వమస్యాది వేదాంతమహావాక్యార్థమగు ప్రత్య గభిన్న బ్రహ్మయొక్క సాక్షాత్కారముచేత అవిద్యయావత్తు నివర్తిం చునుగనుక తత్కార్యమగు ఆకాశాదిప్రపంచము బాధింపబడును॥ అ విద్య తిరిగి పుట్టనేరదుగనుక వేదాంతమహావాక్యార్థ సాక్షాత్కార పూర్వకముగా గలుగుసమాధి నిర్బీజ సమాధియనబడును॥

ఇదియె ముఖ్యసమాధి॥

ఓయి ఈసమాధిని శ్రీశంకర భగత్పాదాచార్యులవారు ఉప దేశసాహస్రియను గ్రంథమునందు చెపియున్నారు॥

శ్లో॥ దృశిస్వరూపంగగనోపమంపరం।
సకృద్విభాతంత్వజమేకమక్షరం।
అలేపకంసర్వగతంయదద్వయం।
తదేవచాహంసతతంవిముక్త ఓం॥

తా॥ జ్ఞానమాత్రస్వరూపమై ఆకాశమువలెనిత్యమై సర్వపదా ర్థములకు కారణమై స్వప్రకాశమై జన్మాదివికారములులేనిదై సర్వభేద శూన్యమై నాశాదివికారరహితమై పుణ్యాపాపాది కర్మసంబంధవివ ర్జితమై సర్వవ్యాపకమై జీవస్వరూపముకంటె అభిన్నమైన యేపరమా త్మ స్వరూపమును నేను సర్వకాలములయందు అవిద్యాది దోషముల చేత విడువబడియున్నాను॥

ఓపరమగురో ఇటువంటి నిర్బీజసమాధినిబొందిన జీవన్ముక్తుయం దు ఆకాశగమనాది శక్తులు కనుపడకుండుటకు కారణంబెద్దియన॥

ఓయిశిష్యా ఈయర్థము శ్రీరామ వసిష్ఠులయొక్క ప్రశ్న ప్రతి వచన వాక్యములచేత స్పష్టముగా జెప్పబడియున్నది॥

శ్లో॥ జీవన్ముక్త శరీరాణాం కథమాత్మ విదాంవర ।
శక్తయోనే హదృశ్యంతే ఆకాశ గమనాదికాః॥

తా॥ జ్ఞానవంతులలో నుత్తముడవైన యో స్వామీ జీవన్ముక్తి నొందిన మహాపురుషులయొక్క శరీరములయందు ఆకాశగమనాదిశక్తులు కనపడుటలేదు. ఇందుకు కారణమేమని ఈప్రకారము శ్రీరాములుప్రశ్నచేయగా శ్రీవసిష్ఠమహర్షి ప్రతివచనము చెప్పుచున్నారు॥

శ్లో॥ అనాత్మ విదముక్తోపి నభో విహరణాదికం।
అణిమాద్యష్ట సిద్ధీనాం సిద్ధిజాలా నివాంఛతి॥

తా॥ ఆత్మజ్ఞాన శూన్యుడగు పురుషుడు ముక్తిని బొందనివాడైయుండి ఆకాశ గమనాది సిద్ధులను అణిమాద్యష్టసిద్ధులను కోరును॥

శ్లో॥ ద్రవ్యమంత్ర క్రియాకాల యుక్త్యాప్నోత్యేవ రాఘవ ।
నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మమాత్రదృక్॥

తా॥ ఆకాశ గమనాది సిద్ధులు ఓషధులు మంత్రములుక్రియలు విశేషములు కాలవిశేషములు వీటిని సాధనములుగా నేర్పరచుకొని పొందుచుందురు. ఆత్మతత్వజ్ఞానము గలవారికి ఓషధి మంత్రాదిసాధనములుగాని ఆకాశ గమనాది సిద్ధులుగాని ఆదరించ తగనవికావు. ఆత్మజ్ఞాని ఆత్మనుమాత్రము చూచుచుండును॥

శ్లో॥ ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యామ నుధావతి ।
యేకేచన జగద్భావా స్తానవిద్యా మయాన్విదుః॥

తా॥ ఆత్మతత్వజ్ఞానము గలవాడు స్వస్వరూపానుభవముచేత తృప్తినిబొందుచుండును. అవిద్యవలన కల్పింపబడిన విషయములలో బ్రవర్తింపడు. ఈప్రపంచములోనుండు విషయములన్నియు అవిద్యచేత కల్పింపబడిఅసత్యభూతములుగానున్నవియని ఆత్మజ్ఞులు తెలిసియుందురు॥

శ్లో॥ కథం తేషు కిలాత్మజ్ఞో త్యక్తావిద్యో నిమజ్జతి ॥

తా ॥ ఆత్మజ్ఞుడగు పురుషుడు అవిద్యను సవాసనగా వదలియు న్నందున అవిద్యాకల్పితములగు సిద్ధులలో ఆసక్తిగలవాడై యేప్రకారముగా నుండును॥

శ్లో॥ ద్రవ్యమంత్ర క్రియాకాల శక్తయ స్సాదుసిద్ధిదాః।
పరమాత్మ పదప్రాప్తౌ నోపకుర్వంతి కాశ్చన॥ *

తా ॥ ద్రవ్యము మంత్రములు క్రియలు కాలము వీటియొక్క సామర్థ్యములు ఆకాశ గమనాది సిద్ధులను కలుగజేసేవి అయినప్పటికి పరమాత్మ స్వరూపమునుబొందు విషయములో కొంచమైనాఉపకారమును చేయజాలవు॥

శ్లో॥ సర్వేచ్ఛాజాల సంశాంతావాత్మ లాభోదయోహియః।
సకథంసిద్ధి వాంఛాయాం మగ్నచిత్తే నలభ్యతే॥ *

తా ॥ సర్వవిషయములయందుగల ఆశ నశించినతరువాతకలిగే ఆత్మస్వరూపలాభమనే మోక్షము ఆకాశగమనాది సిద్ధులలోకోరికగలిగియుండగ నేప్రకారము సిద్ధించును. అనగా సిద్ధించదని భావము॥

శ్లో॥ అపిశీతరు చావర్కే సుతీక్ష్ణేందు మండలే।
అప్యధః ప్రసరత్యగ్నౌ జీవన్ముక్తో నవిస్మయీ॥

తా ॥ అతితీక్ష్ణ స్వభావముగల సూర్యుడు ఒకానొక కాలమందు చల్లనికాంతి గలవాడైనా శీతస్వభావముగల చంద్రుడు వేడిమి గలవాడైనా సర్వదా ఊర్ధ్వజ్వాలలుగల అగ్ని క్రిందిభాగమునకుప్రసరించే జ్వాలలుగలవాడైనా బ్రహ్మతత్వజ్ఞాని ఆశ్చర్యమును బొందడు॥

శ్లో॥ చిదాత్మన ఇమాఇత్థం ప్రస్ఫురంతీ హశక్తయః ।
ఇత్యస్యాశ్చర్య జాలేషు నాభ్యుదేతి కుతూహలం॥

తా ॥ సర్వశక్తియుక్తుడైన పరమాత్మయందు అనేక విధములగు శక్తులుకలవు. అవికొన్నిదేశకాలములయందావిర్భవించును.మరికొన్నిమరికొన్నిదేశకాలములయందావిర్భవించును. యనే అభిప్రాయము గలవాడైనందున బ్రహ్మవేత్త ఇతరజనుల కాశ్చర్యమును గలుగజేయు విషయములయందాశ్చర్యము నొందడు॥

ఓయిశిష్యా ఈసమాధి తత్వజ్ఞానము విదేహముక్తి జీవన్ముక్తుల కు సాధనముగా నుండునుగాని ఆకాశ గమనాదులకు సాధనముకాదు. గనుక ఆత్మ విషయమగు సంప్రజ్ఞాతసమాధి వాసనాక్షయమునకు నిరోధసమాధికిని కారణమై యున్నందున దానియందే మేముఅధర ముంచిఆసమాధినే నిరూపించినారము॥

ఓయి వివేకశాలీ వ్యుత్థాన సంస్కారములు సమాధికి విరోధులుగానుండును. అట్టి సంస్కారము లేవియనగా వాసిష్ఠరామాయణములో ఉద్దాలకమునియొక్క సమాధిలో నుదహరించ బడినవి॥

శ్లో॥ కదాహంత్యక్త మననే పదే పరమపావనే।
చిరంవిశ్రాంతి మేష్యామి మేరుశృంగ ఇవాంబుదః॥

తా॥ ఉద్దాలకుడను ముని సమాధినిచాలించియున్న సమయములో నీప్రకార మాలోచించుచుండెను. నేను విచారశూన్యమై అనగా నసందిగ్ధమై పరమపవిత్రమైన బ్రహ్మస్వరూపమునందు స్థిరముగాచిత్తమును జేర్చి చిరకాలము మేరుపుశిఖరమునందు మేఘమువలె నెప్పుడు నిలువగలను॥

శ్లో॥ ఇతిచింతా పరవశో బలాదుద్దాలకో ద్విజః।
పునఃపునః స్సూపవిశ్య ధ్యానాభ్యాసం చకారహ॥

తా॥ ఈప్రకారము చింతించుచున్నవాడై ఉద్దాలకుడను ముని బలాత్కారముగా మాటిమాటికి కూర్చొనిధ్యానమునుఅభ్యసించెను॥

శ్లో॥ విషయై ర్నీయ్యమానేతు చిత్తమర్కట చంచలే।
నసలేభే సమాధాన ప్రతిష్ఠాం ప్రీతిదాయినీం॥*

తా॥ కోతివలె అతిచపల స్వభావముగల చిత్తము శబ్దాది విషయములచేత నీడ్వబడుచుండగా నుద్దాలకునకు సమాధియందు ఆనందజనకమైన స్థైర్యము కలుగక పోయెను॥

శ్లో॥ కథాచిద్బాహ్య సంస్పర్శ పరిత్యాగా దనంతరం।
తస్యాగచ్ఛ చ్చిత్తకపి రాంతరస్పర్శ సంచయాన్॥

తా॥ ఉద్దాలకునియొక్క చిత్తమును విషయము లాకర్షించిన విధమును చెప్పుచున్నారు. ఆఉద్దాలకునియొక్క చిత్తమనే కోతి ఒకసమయములో బాహ్యావిషయములలోనుంచి మరలించబడి అంతర విషయములయందు సంచరించుచుండును. అనగా బాహ్యావిషయముల యందు ప్రవర్తించకుండా చేయబడిన చిత్తము పూర్వానుభూత విషయములను స్మరించుచుండుననీ భావము॥

శ్లో॥ కదాచిదాంతర స్పర్శా బాహ్యాం విషయ మాదదే।
తస్యోడ్డీయ మనోయాతి కుత్రాపిత్ర స్తపక్షివత్॥ *

తా॥ మరియొక సమయములో అంతర విషయములను విడచి బాహ్య విషయముల గ్రహించుచుండును. మరియొక సమయములో ఆ వుద్దాలకునిమనస్సు బెదరినపక్షివలె యెగిరియెక్కడికోబోవుచుండును॥

శ్లో॥ కదాచిదుదితార్కాభాం తేజఃపశ్యతి విస్తృతం।
కదాచిత్కేవలం వ్యోమం కధాచిన్నిబిడంతమః॥

తా॥ ఒకసమయములో సూర్యసమానమగు ప్రకాశమును జూచును. మరియొక సమయమందు కేవలాకాశమును మరియొకకాలమందు దట్టమైన చీకటిని చూచును॥

శ్లో॥ ఆగచ్ఛతో యధాకామం ప్రతిభాసా త్పునఃపునః।
అచ్ఛినన్మనసా శూరః ఖడ్గనే వరణే రిపూన్॥ *

తా॥ ఈప్రకారము యథేచ్ఛముగా కలుగుచున్న విషయవాసనలను ఆఉద్దాలకుడు తనమనస్సనే ఖడ్గముచేత శూరుడగువాడు యుద్ధమునంచు శత్రువులను ఖండించినట్లు ఖండించెను॥

శ్లో॥ వికల్పౌఘేనమాలూనే సోపశ్యద్ధృదయాంబరే।
తమశ్ఛన్నవివేకార్కం లోలకజ్జలమేచకం॥

తా॥ ఈప్రకారము విషయములనన్నిటిని భేదించిన తరువాత ఆఉద్దాలకుడు తన చిత్తాకాశమందు అజ్ఞానముచేత నావరింపబడినందున కాటుకపొడివలె నల్లనైచలించుచున్న వివేకమనే సూర్యబింబమునుచూచెను॥

అనగా తమోగుణ భూయిష్టమైన అత్మానాత్మవివేకము స్ఫురించెనని భావము॥

శ్లో॥ తమఋత్యాత్సాదయామాస సమ్యజ్ఞానవివస్వతా।
తమస్యుపరతేస్వాంతే తేజఃపుంజందదర్శసః॥

తా॥ సమ్యగ్ జ్ఞానమనే సూర్యునిచేత అతమోగుణమనే అంధకారమును నివర్తింపజేసినతరువాత ఉద్దాలకునకు తనహృదయమందాక తెజోవిశేషము కనుపడెను॥

శ్లో॥ తల్లులావస్థలాజ్ఞానాం వనంబాలఇవద్విపః।
తేజస్యుపరతేతస్య ఘూర్ణమానంమనోమునేః।
స్నిశాబ్జవదగాన్నిద్రాం తామప్యాశులులావసః॥

తా॥ మెట్టతామరను ఏనుగ తెంచివేసినట్లు ఉద్దాలకుడు ఆతేజస్సును భేదించెను తేజస్సు నివర్తించగానే ఆమునియొక్కమనస్సు విహ్వాలమై రాత్రికాలమందు తామరపూవువలె ముడుచుకొనిపోయెను అనగా నిద్రలోచేరెను నిద్రనుకూడా ఆముని నివారించెను॥

శ్లో॥ నిద్రావ్యపగమేతస్య వ్యోమసంవిత్సముద్యయా।
వ్యోమసంవిదినష్టాయాం మూఢంతస్యాభవన్మనః॥

తా॥ చిత్తమందు నిద్రయనే లయదశనివర్తింపగానే శూన్యత్వావస్థజనించెను ఆశూన్యత్వావస్థనుకూడా నివారించగా ఆముని యొక్క మనస్సు మూఢముగానుండెను అనగా యేవిషయమును గ్రహించకుండ నిర్విషయముగానుండెనని భావము॥

శ్లో॥ మోహమప్యేషమనస స్తంమమార్జ మహాశయః।
తతస్తేజస్తతోనిద్ర మోహాదిపరివర్జితాం॥
కామప్యవస్థామాసాద్య విశశ్రామమనఃక్షణం॥

తా॥ ఈఉద్దాలకుడు ప్రమాదములేనివాడై తనచిత్తమునందు గలిగిన ఆమోహమునుగూడా నివారించెను॥

అనంతరము నిద్రామోహాది దోషములులేని అవాజ్ఞానసగోచ

రముయిన స్థితినిబొంది అఉద్దాలకునియొక్క మనస్సు విశ్రమము నొందెను॥

అనగా సకలవిషయముల పరిత్యజించి బ్రహ్మాకారమై ఆముని యొక్క మనస్సు హాయినిబొందెనని తాత్పర్యము॥

గనుక ఓయిశిష్యా బ్రహ్మతత్వ జ్ఞానేచ్ఛ కలిగియున్నప్పటికి చిత్తమునకు క్షిప్త మూఢ విక్షిప్త భూమికలయందుండే బాహ్యాంతరములయందుండే సంచారము అనవస్థత్వము॥ దేహాంతరాళమందుండు తేజస్సును తమస్సునుజూచుట నిర్విషయముగానుండుట ఇదిమొదలగునవి వ్యుత్థానసంస్కారములని చెప్పబడును॥ యనగా॥

ఓస్వామీ క్షిప్త విక్షిప్త మూఢ నిరుద్ధ ఏకాగ్రచిత్తముల స్వరూపంబెట్టిదో దెలుపవేయన॥

క్షిప్తమనగా రజోగుణప్రధానమై సుఖదుఃఖాది విషయములందు బ్రవర్తించు నదియై మిగుల అస్థిరమైయుండు చిత్తము క్షిప్తమనబడును॥

ఈచిత్తము దైత్యదానవులకు గలిగియుండును॥

మూఢమనగా తమోగుణప్రధానమై కృత్యాకృత్య విమర్శజ్ఞాన వివేచనలేక క్రోధాదికార్యములయందు బ్రవర్తించిన చిత్తము॥ మూఢమనంబడును॥ ఈచిత్తము పిశాచ రాక్షసులకు గలిగియుండును॥

విక్షిప్తమనగా సత్వగుణాధిక్యమై భోగసాధనాదులయందు బ్రవర్తించిన చిత్తము విక్షిప్తమనబడును ఇది దేవతులకు గలిగియుండును —ఏకాగ్రమనగా॥ బాహ్యమందు ప్రసరించనిచిత్తము ఏకాగ్రమనబడును॥

నిరుద్ధమనగా॥ వృత్తులును సంస్కారములును లేని చిత్తము నిరుద్ధమనబడును॥

ఓయి యోగధుర్యా॥ ఈఏకాగ్ర నిరుద్ధ చిత్తములు రెండుమాత్రమే సమాధిని యొనగూర్చును॥

ఓయిశిష్యా॥ ఈచెప్పబడిన చిత్తభూమికలనైదింటిలో॥ ఏకాగ్ర నిరుద్ధముల మాటిమాటికి యభ్యాసముచేయుచుండగా కట్టెలు లేని అగ్ని మొదటిక్షణమునందు కొంచెము శాంతినొంది తర్వాత ప్రతిక్షణము విశేషముగా యెట్లు శాంతినొందుచుండునో అప్రకారమే నిరోధింపబడిన చిత్తము ఉత్తరోత్తరము అధికమైన శమమును నొందుచుండును॥ ఇదియే ప్రశాంతవాహిత యనబడును॥

ఇట్టి ప్రశాంతవాహితయనే చిత్తపరిణామమును శ్రీకృష్ణమూర్తి భగవద్గీతలయొక్క ఆరవ అధ్యాయములో విస్పష్టముగా నానతిచ్చియున్నారు॥

శ్లో॥ యదావినియతంచిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్తఇత్యుచ్యతేతదా॥

తా॥ విశేషముగా నిరోధింపబడిన చిత్తము యెప్పుడు చిద్రూపుడగు పరమాత్మయందే నిశ్చలముగానుండునో అప్పుడు సర్వకామములయందు కోరికలేనిపురుషుడు యోగస్థిగలవాడాయెనని యెరుగవలయును॥

శ్లో॥ యథాదీపోనివాతస్థో నేంగతేసోపమాస్మృతా।
యోగినోయతచిత్తస్య యుంజతోయోగమాత్మనః॥

తా॥ గాలిలేని ప్రదేశములో పెట్టబడిన దీపము యేప్రకారము చలించకయుండునో పరమాత్మ విషయమైన యోగమునభ్యసించే పురుషునియొక్క నిరోధమును బొందిన చిత్తము అప్రకారముగా నుండును॥

ఓయిశిష్యా॥ నిరోధసమాధియొక్క సాధనమును పతంజలిసూత్రముచేత నిరూపించియున్నారు॥

సూత్రము॥ విరామప్రత్యయాభ్యాసపూర్వకః సంస్కారశేషోన్యః॥

తా॥ వృత్తులయొక్క ఉపశమము విరామమనబడును అట్టివిరామమునకు కారణము పురుషప్రయత్నము ఈపురుషప్రయత్నమును అడుగడుగు కభ్యసించుటచేత అసంప్రజ్ఞాత సమాధిపుట్టును ఇదియే

నిరోధసమాధి యనబడును ఈసమాధియందు వృత్తిశూన్యమగు చిత్తము తనస్వరూపముతో కనుపడకుండ సంస్కారమాత్రముగా నుండునని సూత్రార్థము॥

ఓయిశిష్యా ఈనిరోధసమాధి యెడతెగనియలవాటుచేత పుట్టునని శ్రీకృష్ణమూర్తిచేత చెప్పబడినది॥

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వాస్సర్వాన శేషతః।
మనసైవేంద్రియగ్రామం వినియమ్యసమంతతః॥

తా॥ సంకల్పముచేత పుట్టుచుండే యోగప్రతికూలములగు ఆశలనన్నిటిని సవాసనగా వదలివేసి ఇంద్రియములను విషయములలోకి చేరకుండా మనస్సుచేతనాకర్షించి యోగమునభ్యసింపవలెను॥

శ్లో॥ శనైశ్శనైరు పరమే ద్బుద్ధ్యాధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనఃకృత్వా నకించి దపిచింతయేత్॥

తా॥ ధారణచేత స్వాధీనపరచుకోబడిన బుద్ధివలన మనస్సును పరమాత్మయందు నిశ్చలముగాజేర్చి అభ్యాసక్రమముగానుపరతినిబొందవలయును. ఇతర విషయములను కొంచమైన చింతించకూడదు. ఓపరమగురో అతిచపల స్వభావముగల మనస్సును నిగ్రహించుట వాయువుయొక్క నిరోధమువలెనే శక్యముగాదని తలంచెదను. యనిన ఓయి శిష్యా నీవలెనే తలచిన అర్జునునిగూర్చి అభ్యాస వైరాగ్యములచేత మనోనిరోధమును చేయవచ్చునని శ్రీకృష్ణమూర్తిచేత నుత్తరము చెప్పబడినందున మనోనిరోధము చేయుటకు శక్యమైయుండదని శంకింపదగదు॥

ఇందుకుప్రమాణము॥

శ్లో॥ అసంశయంమహాబాహో మనోదుర్నిగ్రహంచలం।

అభ్యాసేనతుకౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే॥

తా॥ ఓఅర్జునా మనస్సు అతిచంచలమైనది నిగ్రహించుటకు శక్యమైనదికాదు ఇందుకు సంశయములేదు గాని అభ్యాసముచేత వైరాగ్యముచేత మనస్సు నిగ్రహింపబడును అనగా హఠయోగముచేత నిగ్ర

హింప శక్యముకాదు గాని మృదుయోగముచేత సాధ్యమైయుండునని శ్రీకృష్ణభగవానులానతిచ్చి యున్నారు॥

ఓయిశిష్యా ఉపాయముచేత యోగముసాధ్యమై యుండునని శ్రీగౌడ పాదాచార్యులవారిచేకూడా చెప్పబడినది॥

శ్లో॥ ఉత్సేక ఉదధేర్యద్వ త్కుశాగ్రేణైక బిందునా।
మనసోనిగ్రహ స్తద్వ ద్భవేదపరి ఖేదతః॥ *

తా॥ దర్భాగ్రముచేత నొక్కొక్కబిందువును వెలుపలకువిసుకు నొందకుండ చల్లుతూవుంటే యేప్రకారము సముద్రమునొక్కజలమును యావత్తు నిశ్శేషముగా నివర్తింపజేయనగునో ఆప్రకారముమనోనిగ్రహోపాయములయందు విసుకులేక ప్రవర్తించేవానిచేత మనస్సు నిగ్రహింపబడును॥

ఓయి శిష్యరత్నమా ఈప్రకారమే పరమధర్మమైన మనోనిరోధమునందు ప్రయత్నముచేయు పురుషుడు విసుకులేక జేసేపక్షమందు వానిని పరమేశ్వరు డనుగ్రహించి త్వరగా మనోనిరోధను కలిగేలాగు నచేయును. కావున ఈయభిప్రాయముతోనే వసిష్ఠమహర్షి చెప్పియున్నారు॥

శ్లో॥ చిత్తస్యభోగై ర్ద్వౌభాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్।
గురుశుశ్రూష యాభాగ మవ్యుత్పన్నస్య సంక్రమః॥ *

తా॥ వివేకములేని మనస్సుకు వివేకము కలుగజేయు నపుడు మొదట చిత్తముయొక్క రెండుభాగములను భోగములచేతను ఒక్కభాగమును శాస్త్రముచ్చేతను మరియొకభాగమును గురుశుశ్రూషచేతను నింపింపవలయును॥

శ్లో॥ కించిద్వ్యుత్పత్తి యుక్తస్య భాగంభోగై ప్రపూరయేత్।
గురుశుశ్రూషయా భాగౌ భాగంశాస్త్రార్థ చింతయా॥ *

తా॥ కొంచము వివేకము గలిగినతరువాత నొకభాగమును భోగముచేత రెండుభాగములను గురుశుశ్రూషచేత మరియొకభాగమును శాస్త్రవిచారముచేత నింపింపవలయును॥

శ్లో॥ వ్యుత్పత్తి మనుయాతస్య పూరయేచ్ఛే తసోన్వహం।
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్య ర్ధ్యాన గురుపూజయా॥

తా ॥ విశేషముగా వివేకమును బొందినతరువాత ప్రతిదినము చిత్తముయొక్క రెండుభాగములను శాస్త్రవిచార వైరాగ్యములవలనను రెండుభాగములను తత్త్వానుసంధానమువలనను నిండింపవలయును॥

గనుక ఓంయిశిష్యాఈనిరోధమను చతుర్థ భూమికాభ్యాసమును గౌడపాదాచార్యుల వారిచేకూడా చెప్పబడినది॥

శ్లో॥ ఉపాయేన నిగృహ్ణీయా ద్విక్షిప్తం కామభోగయోః।
సుప్రసన్నం లయేచైవ యథాకామో లయస్తథా॥*

తా ॥ కామభోగములయందు విక్షేపమును బొందుచున్న చిత్తమును ఉపాయమువలన మరలించవలయును లయమునందు ప్రవేశించు చిత్తమును ఆయాసము లేకపోయినా ప్రబోధమును పొందించవలయును. లయముయెటువంటిదో కామముకూడా అటువంటిది॥

శ్లో॥ దుఃఖంసర్వ మనుస్మృత్య కామభోగా న్నివర్తయేత్ ।
అజంసర్వ మనుస్మృత్య జాతంనైవతు పశ్యతి॥ *

తా ॥ ద్వైతప్రపంచమంతయు నవిద్యా విజృంభితంబగుటవలన దుఃఖరూపమని విచారించి కామభోగములనుంచి చిత్తమునునిరోధించవలయును. సర్వప్రపంచము బ్రహ్మస్వరూపముగా భావించుటచేత ద్వైతప్రపంచమును చూడకయుండును॥

శ్లో॥ లయేసంబోధయే చ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః ।
సకషాయం విజానీయా త్సమప్రాప్తం నచాలయేత్ ॥

తా ॥ లయావస్థలోచేరిన చిత్తమును బోధించవలయును. విక్షేపము నొందినచిత్తమును శమింపజేయవలయును. కషాయావస్తను బొందిన చిత్తమును గుర్తెరిగి సామ్యావస్థను పొందించవలయును. సామ్యావస్థనుబొందినతర్వాత నాచిత్తమును నాయవస్థలోనుంచి కదలనివ్వకూడదు॥

శ్లో॥ యధాన విద్యతేచిత్తం నచవిక్షిప్యతే పునః॥
అసంగ సమనాభాసం నిష్పన్నం బ్రహ్మతత్తదా॥

తా॥ ఈప్రకారముగా నిగ్రహింపబడినచిత్తము యెప్పుడును షుప్తియందు లయమును బొందదో విషయములయందు విక్షేపములను బొందదో చలనమును పొందదో కల్పితపదార్థములచేత ప్రకాశించక యుండునో అప్పుడు బ్రహ్మస్వరూపముగా చిత్తము పర్యవసించినదని తెలియవలయును. కాబట్టి ఓయిశిష్యా ఈయోగసిద్ధికి వైరాగ్యము రెండువిధములు. అపరవైరాగ్యమనియు పరవైరాగ్యమనియు. ఇందులో పరవైరాగ్యము॥ యతమానమని వ్యతిరేకమని ఏకేంద్రియమని వశీకారమని నాలుగువిధములు. యతమానవైరాగ్యమనగా॥ ఈప్రపంచమందు సారమైనదియేదియో సారములేనిదిఏదియో వీటిని గురూపదేశశాస్త్రవిచారములచేత తెలుసుకొనుదునని ప్రయత్నపడుట యతమానవైరాగ్య మనంబడు॥ ౧॥

వ్యతిరేకవైరాగ్యమనగా॥

తనచిత్తమందు పూర్వము కలిగియున్న దోషములలో యభ్యసించబడే వివేకముచేత నిప్పటికి యెన్ని నివర్తించినవి ఇకయెన్నిదోషములు మిగిలియున్నవియని ప్రతిదినము పరిశీలనచేయుట వ్యతిరేకవైరాగ్యమనంబడు. యేకేంద్రియ వైరాగ్యమనగా॥

దృష్టాదృష్ట విషయములలో ప్రవర్తించుట దుఃఖరూపమని తెలసి యాప్రవృత్తిని విడచిపెట్టి మనస్సునందు మాత్రము విషయరుచి కలిగి యుండుటయే యేకేంద్రియ వైరాగ్య మనబడును॥

వశీకార వైరాగ్యమనగా॥

ఇట్టి మానసిక విషయరుచికూడా దృష్టాదృష్ట విషయములలో లేకయుండుట వశీకార వైరాగ్యమనబడును॥

కావున ఓయిశిష్యా ఈయపరవైరాగ్యము అష్టాంగయోగములయందు ప్రవర్తింపజేయునది గనుక సంప్రజ్ఞాతసమాధికి యంతరంగ

ముగానుండును. అసంప్రజ్ఞాత సమాధికి బహిరంగము అసంప్రజ్ఞాతస మాధికి పరవైరాగ్య మంతరంగముగా నుండును॥

గుణత్రయములయందును వాటివలనబుట్టిన సమస్తపదార్థముల యందును కలిగే వైరాగ్యము పరవైరాగ్య మనబడును॥

ఓముశిష్యా తీవ్రవైరాగ్యముచేత సమాధిసిద్ధిస్వల్పకాలములోనే కలుగును. యిందు మృదుసంవేగులని మధ్యసంవేగులని తీవ్రసంవేగులని యోగులు మూడువిధము॥

తీవ్ర వైరాగ్యముగల యోగులలో॥

మృదుతీవ్ర వైరాగ్యమని మధ్యతీవ్ర వైరాగ్యమనిన్ని అతితీవ్ర వైరాగ్యమని ఈతీవ్రవైరాగ్యమే మూడువిధములుగా నున్నది॥

ఇందులో మృదు తీవ్రవైరాగ్యము గలవారికంటె మధ్యతీవ్రవై రాగ్యముగలవారికి అంతకంటె అతితీవ్రవైరాగ్యముగలవారికిని సమాధి త్వరగా సిద్ధించునని దెలియుము॥

ఓముశిష్యా ఉత్తమోత్తములైన జనకప్రహ్లాదాదులు అతితీవ్ర వైరాగ్యముగలవారు. గనుకనే నొకముహూర్తమాత్రము తత్వవిచా రము చేసినమాత్రమున దృఢసమాధిని బొందిరి॥

ఉద్దాలకుడు మొదలగు యోగులు మృదుతీవ్ర వైరాగ్యముగల వారుగనుకనేసంతతాభ్యాసమువలనగానిసమాదిసిద్ధినొందరైరి॥యనిన

ఓగురుస్వామీ యిట్లు మనోనాశము కలుగగానే జీవన్ముక్తినిల చియుండక విదేహమోక్షమే కలుగునను సందేహము తోచుచున్నదిగా న మదీయ సందేహంబు నివర్తింపజేయదేవరవారేకర్తలని వేడుకొనిన॥

ఓముశిష్యా మనోనాశముకలిగినా జీవన్ముక్తి నిలచియుండునని శ్రీరామ వసిష్ఠులయొక్క ప్రశ్నప్రతివచనములనునిర్ణయింపబడియున్నది॥

శ్రీరాములవారిప్రశ్నము.

శ్లో॥ వివేకాభ్యుదయాచిత్త స్వరూపేంతర్హితేమునే।
మైత్ర్యాదయోగుణాఃకుత్ర జాయంతేయోగినాంవరా॥

తా॥ ఓమునివర్యా వివేకముమిగుల పెంపొందుటవలన చిత్త మునశించగా మైత్రీకరుణాది శుభవాసనలు యోగులగువారికి యెచ్చటబుట్టును॥ ఇందుకు వసిష్ఠమహర్షియొక్క ప్రతివచనము॥

శ్లో॥ ద్వివిధశ్చిత్తనాశోస్తి సరూపోరూపయేవచ।
జీవన్ముక్తౌస్సరూపస్స్యా దరూపోదేహముక్తిగః॥

తా॥ మనోనాశము సరూపమనిన్ని అరూపమనిన్ని రెండువిధములు అందులో జీవన్ముక్తియందు మనోనాశము సరూపముగానుండును విదేహముక్తియందు అరూపముగానుండును॥

శ్లో॥ ప్రాకృతంగుణసంభారం మమేతిబహుమన్యతే।
సుఖదుఃఖాద్యావష్టబ్ధం విద్యమానంవిదోవిదుః॥

తా॥ సుఖదుఃఖాదులకు కారణములై వర్తించు గుణత్రయాత్మకప్రకృతి సంబంధములైన రాగద్వేషాది గుణములను తనవిగా అభిమానించే పదార్థమును మనస్సునుగా చెప్పుదురు॥

శ్లో॥ చేతసఃకథితాసత్తా మయారఘుకులోద్వహ।
అస్యనాశమిదానీంత్వం శృణుప్రశ్నవిదాంవర॥

తా॥ ఓరఘువంశప్రతిష్టాపకుడవైన రామచంద్రా మనస్సుయొక్క సత్తను చెప్పితిని. —ఈమనస్సుయొక్క నాశమునుచెప్పెదను వినుము॥

శ్లో॥ సుఖదుఃఖదశాధీరం సామ్యన్నప్రోద్ధరంతియం।
నిశ్వాసాఇవశైలేంద్రం తస్యచిత్తమృతంవిదుః॥

తా॥ బ్రహ్మతత్వసాక్షాత్కారముగలిగి నిరంతరబ్రహ్మానుసంధానముగల యేపురుషునినిట్టూర్పు వాయువులు పర్వతమును కదవించలేనట్టు సుఖదుఃఖాద్యవస్థలు కదిలించనేరవో యాపురుషునియొక్క చిత్తము నశించినదని యెరుంగవలయును॥

శ్లో॥ ఆపత్కార్పణ్యముత్సాహా మదోమాంద్యంమహోత్సవః।
యంనయాంతినవైరూప్యం తస్యనష్టంమనోవిదుః॥

తా॥ పుత్రకళత్రాది నానారూపమైన యాపదయును దారిద్ర్యమును పుత్రజన్మాదులవలనగలుగు సంతోషమును ధనపాండిత్యములవలన గలుగుగర్వమును అలసత్వమును వివాహాదిమహోత్సవ దర్శనమువలన గలుగు హర్షమును ఏపురుషునియందు సంగతములుకావో ఇవి ఏపురుషుని వైరూప్యమును బొందించనేరవో ఆపురుషునికి మనస్సునశించినదని తెలియవలయును॥

శ్లో॥ చిత్తమాశాభిదానంహి యథానశ్యతిరాఘవ।
మైత్ర్యాదిభిర్గుణైర్యుక్తం తదాసత్వముదేత్యలం॥

తా॥ ఆశయేచిత్తమనంబడును ఇట్టిచిత్తమెప్పుడు నశించునో అప్పుడు చిత్తము మైత్ర్యాదిగుణములతోగూడి సత్వగుణప్రధానమై యావిర్భవించును రాగద్వేషాదిరూపములు నశించగానే మైత్రీ ముదితాదిగుణములతోకూడా చిత్తముయొక్క సత్వాంశము వృద్ధినొందునని భావము॥

శ్లో॥ భూయోజన్మవినిర్ముక్తం జీవన్ముక్తశ్యతన్మనః।
సరూపోసౌమనోనాశః జీవన్ముక్తస్యవిద్యతే॥

తా॥ జీవన్ముక్తునిమొక్క మనస్సు పునర్జన్మకు కారణముగాకయుండును ఇదియే సరూపమనే మనోనాశము ఇట్టిమనోనాశము జీవన్ముక్తునికి కలిగియుండును॥

శ్లో॥ అరూపస్తుమనోనాశో యోమయోక్తోంరఘూద్వహ।
విదేహముక్తావేవాసౌ విద్యతేనిష్ఫలాత్మకః॥

తా॥ ఏఅరూపమనే మనోనాశము నాచేతచెప్పబడెనో అది ప్రయోజనములేనిదై విదేహముక్తియందే కలిగియుండును॥ అనగా జీవన్ముక్తియందుగల మనోనాశము మైత్రీ ముదితాది గుణముల కాశ్రయమయియుండును విదేహముక్తియందుగల మనోనాశము ఆత్మమాత్రశేషముగానున్నందునను ఆత్మస్వరూపము నిర్గుణమైనందునను మైత్ర్యాదిగుణాశ్రయత్వముకూడా లేకయుండునని భావము॥

శ్లో॥ సమగ్రాగ్ర్యగుణాధార మపిసత్త్వప్రధీయతే।
విదేహముక్తావమనే పదేపరమపావనే॥

తా॥ విదేహముక్తియనగా నిర్మలమై పరమపవిత్రమైన పరబ్రహ్మస్వరూపమే దానియందు సర్వశ్రేష్ఠముత్తైన సమస్త మైత్ర్యాదిగుణములతోగూడా తదాశ్రయమయిన మనస్సునశించును. ఇదియే అరూపమనోనాశము॥

గనుక ఓయిశిష్యా జీవన్ముక్తులగు మహాత్ములకు సరూపమనోనాశసమాధి కలిగియుండునని ఇదియే జీవన్ముక్తిసాధనమని సిద్ధము॥

మనోనాశనిరూపణము సమాప్తము.

## ✻ జీవన్ముక్తిఫల నిరూపణము. ✻

ఓపరమగురో జీవన్ముక్తిసిద్ధించినందున నేమి ప్రయోజనముకలదో యనుసంశయము కలుగుచున్నది గనుక ఈసందేహము నివారణజేయ దేవరవారే కర్తలని వేడుకొనిన శిష్యునింజూచి॥

ఓయిశిష్యా॥ ఈజీవన్ముక్తి సిద్ధించినందున జ్ఞానస్ఫురణము తపస్సు విసంవాదాభావము దుఃఖనాశము సుఖావిర్భావములను ప్రయోజనములుకలవు॥

ఓపరమగురో నిత్యనిర్దోషమయిన వేదాంతప్రమాణముచేత గలిగిన తత్వజ్ఞానమునకు బాధ యసంభావితమయి యుండగా తత్వజ్ఞాన రక్షణము జీవన్ముక్తి ప్రయోజనమనుటయందు శంకకలుగుచున్నదనిన॥

ఓయిశిష్యా చిత్తవిశ్రాంతి జీవన్ముక్తి సిద్ధిచేతకలుగును గనుక జీవన్ముక్తి చిత్తవిశ్రాంతిద్వారా సంశయవిపర్యయములను నివర్తింపజేసి తత్వజ్ఞానమును సుస్థిరముగాజేయును గనుక జీవన్ముక్తికి తత్వజ్ఞానరక్షణము ప్రయోజనమనిచెప్పుట యుక్తముగానేయున్నది॥

చిత్తవిశ్రాంతిలేనిమొదల సంశయవిపర్యయములు తత్వజ్ఞానబాధకములుగా సంభవించును ఆయసంశయవిపర్యములు చిత్తవిశ్రాంతిచేత నివర్తించును॥

ఓయిశిష్యా శ్రీరాములవారికి తత్వజ్ఞానము కలిగియున్నప్పటికి చిత్తవిశ్రాంతికి పూర్వమునందు సంశయము కలిగియున్నట్టు వాసిష్ట రామాయణములో విశ్వామిత్రమహర్షి వలన చెప్పబడియున్నది॥

శ్లో॥ నరాఘవతవా స్త్యన్యత్ జ్ఞేయంజ్ఞానవతాంవర।
స్వయైనసూక్ష్మయాబుద్ధ్యా సర్వంవిజ్ఞాతవానసి॥

తా॥ఓరామచంద్రా నీవుచెప్పినసంగతులను విచారించగా నీవు తెలుసుకోవలసినసంగతి మరియొకటిలేదు నీవుసూక్ష్మమయిన స్వబుద్ధి చేతనే సమస్తమును తెలుసుకుంటివి॥

శ్లో॥ భగవద్వ్యాసపుత్రస్య శుకస్యేవమతి స్తవ।
విశ్రాంతిమాత్రమేవాత్ర జ్ఞాతజ్ఞేయాప్యపేక్షతే॥

వ్యాసమహాషికుమారుడైన శుకమహాషియొక్క బుద్ధివలె నీబుద్ధికూడా తెలుసుకోవలసిన యర్థమును యావత్తు తెలుసుకొనియు న్నప్పటికిని విశ్రాంతిమాత్ర మపేక్షించుచున్నది।

ఓయిశిష్యా శుకమహాషి స్వబుద్ధిచేతనే తత్వమును సమగ్ర ముగా తెలుసుకొని స్వాగతార్థమునందు సంశయముగలవాడై తండ్రి యగు వ్యాసమహాషిని ప్రశ్నచేయగా వారుతనకు తెలిసినప్రకారమే చెప్పినందున అప్పటికిని సంశయించి జనకమహారాజు సన్నిధికిపోయిఆ యనవలనకూడా నీప్రకారమే యుపదేశింపబడి యాజనకరాజునుగూ ర్చి యీప్రకారముగా చెప్పెను॥

శ్లో॥ స్వయమేవమయాపూర్వ మేతత్ జ్ఞాతంవివేకతః।
ఏతదేవచపృష్టేన పిత్రామేసముదాహృతం॥

తా॥ ఓజనకమహారాజా మీరుచెప్పిన ఈతత్వార్థమును నేనిది దరకే వివేకయుక్తమయిన బుద్ధిచేత తెలుసుకొనియుంటిని మాతండ్రి యగు వ్యాసమహర్షిని యడుగగా వారునిదియేచెప్పిరి॥

శ్లో॥ భవతాప్యేషఏవార్థః కథితోవాగ్విదాంవర।
ఏషఏవచవాక్యార్థః శాస్త్రేషుపరిదృశ్యతే॥

తా॥ మీచేతకూడా ఈయర్థమే చెప్పబడినది. సమస్తశాస్త్ర
ములయందు విచారించగా ఈయర్థమే కనుబడుచున్నది॥

శ్లో॥ యథాయం సవికల్పోత్థః స్వవికల్ప పరిక్షయాత్।
క్షీయతేదగ్ధ సంసారః నిస్సార ఇతినిశ్చయః॥ *

తా॥ నిస్సారమైన ఈసంసారము స్వభ్రాంతిచేత కలిగిన దని
స్వభ్రాంతి నివర్తించగా సంసారము నివర్తించునని నేనునిశ్చయిం
చుకున్న యర్థము. ఈయర్థమే మాతండ్రిగారిచేత మీచేత శాస్త్రము
లచేతకూడా చెప్పబడినది॥

శ్లో॥ తతః మేతన్మహాబాహో సత్యంబ్రూహి మమాచలం।
త్వత్తోవిశ్రామమాప్నోమి చేతసాభ్రమతా జగత్॥ *

తా॥ ఓజనక మహారాజా నేనునిశ్చయించుకున్న యర్థమున్ను
మీరుచెప్పిన యర్థమున్ను వాస్తవమా, నాకు సత్యముగాచెప్పుముజగత్తు
నుగురించి నేనునిశ్చయించుకున్న యర్థము వాస్తవమా అవాస్తవమా
యని భ్రమించు చిత్తముగల నేను మీఉపదేశముచేత విశ్రాంతిని పొం
దెదను॥ జనకమహారాజు చెప్పుచున్నారు॥

శ్లో॥ నాతః పరతరః కశ్చిన్నిశ్చయోస్త్యపరో మునే।
స్వయమేవత్వయాజ్ఞాతం గురుతశ్చ యథాశ్రుతం॥

తా॥ ఓశుకమహాముని ఇదియేవాస్తవార్థము. ఇంతకుమించిన
వాస్తవములేదు. నీవు స్వబుద్ధిచేతనే ఈయర్థమును తెలుసుకొంటివి. మీ
తండ్రిగారిచ్చేతకూడా వినియుంటివి॥

శ్లో॥ అవ్యచ్ఛిన్న శ్చిదాత్మైకః పుమానస్తీహ నేతరత్।
స్వసంకల్ప వశాద్బద్ధః నిస్సంకల్పస్తు ముచ్యతే॥*

తా॥ దేశకాలవస్తు పరిచ్ఛేదములేని చిద్రూపుడైన పరమపు
రుషు డొకడేకలడు. మరియొకటిలేదు ఆపురుషుడుతనసంకల్పమనేమా
యాశక్తిచేతనే బద్ధుడై సంసారము ననుభవించును. సంకల్ప శూన్యు
డాయెనా ముక్తుడగును॥

శ్లో॥ తేనత్వం యాస్ఫుటం జ్ఞాతం జ్ఞేయంస్వస్య మహాత్మనః।
భోగేభ్యో విరతిర్జాతా దృశ్యాద్వా సకలాదిహ॥ *

తా॥ తెలియదగిన నీయర్థము నీకు బాగుగా తెలిసెను మహానుభావుడవైన నీకు సమస్తభోగములయందు సమస్త ప్రపంచమందును విరక్తికలిగెను॥

శ్లో॥ ప్రాప్తం ప్రాప్తవ్య మఖిలం భవతా పూర్ణచేతసా।
నదృశే తపసిబ్రహ్మాణ్ ముక్తవస్త్వం భ్రాంతిముత్సృజః ॥

తా॥ పరిపూర్ణ చిత్తముగల నీచేత పొందవలసిన ఫలమంతయు పొందబడినది. నీవు ఈమిథ్యా ప్రపంచమ్మం దాసక్తి గలవాడవు కాకపోతివి. గనుకనే నీవు ముక్తుడవు భ్రాంతిని విడువుము॥

ఓయిశిష్యా మహాత్ముడైన జనకమహారాజుచే నుపదేశింపబడి స్వపరమాత్మయందు సర్వవ్యాపారో పరమ పూర్వకంబుగా పరమాత్మస్వరూపమందు నిస్సంశయముగా నిష్టగలవాడై యుండెను. గనుక తత్వజ్ఞానము పుట్టినప్పటికి విశ్రాంతిలేని పక్షమందు శుకమహామునికి శ్రీరాములవారికివలె సంశయము కలుగుచుండును. అట్టిసంశయము అజ్ఞానమువలె తత్వజ్ఞానమునకు ప్రతిబంధకమై యుండును॥

గనుకనే భగవద్గీతలయందు చెప్పబడినది॥

శ్లో॥ అజ్ఞశ్చా శ్రద్ధదానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోస్తి నపరో నసుఖం సంశయాత్మనః॥

తా॥ అజ్ఞాన విపర్యయ సంశయములుగల పురుషుడుపురుషార్థమును పొందక నశించిపోవును. అజ్ఞాన విపర్యయములు గలవాడు ఇహలోకమందైనా కొంచెము సుఖమునుపొందును. సంశయచిత్తుడు ఈ లోకమందుగాని పరలోకమందుగాని సుఖము నెప్పటికి పొందనేరడు॥

ఓయిశిష్యా అజ్ఞాన విపర్యములు మోక్షమునుమాత్రము ప్రతిబంధించును. సంశయము భోగమోక్షములను రెంటిని బ్రతిబంధించును॥

సంశయమనగా దేనియందునునిశ్చయబుద్ధిలేకపోవుట. గనుకనే

యెప్పుడు సంసార సుఖములయందు ప్రవర్తించునో అప్పుడు మోక్ష మార్గబుద్ధి సంసారసుఖ ప్రవృత్తి బుద్ధిని నిరోధించును॥

ఎప్పుడు మోక్షమార్గమునందు ప్రవర్తించునో అప్పుడు సంసారబుద్ధి యామోక్షమార్గ ప్రవృత్తబుద్ధిని నిరోధించును॥

గనుక సంశయాంతఃకరణము గలవారు ఇహలోక పరలోకములయందును నొకసుఖమైనా పొందనేరరు॥

ఓయిశిష్యా ఈసంశయ విపర్యాసములకే అసంభావనావిపరీత భావనలను పేర్లుగలవు॥

శ్లో॥ భావనా విపరీతాయా యాచా సంభావనా శుక ।
కురుతే ప్రతిబంధంసా తత్వజ్ఞానస్య చాపరా॥ అని॥

తా॥ విపరీత భావనయనేదిన్ని అసంభావన యనేదిన్ని తత్వజ్ఞానమునకు ప్రతిబంధకములు. ఇవిగాక నితరములు ప్రతిబంధకములు కానేరవు. జీవాభిన్న బ్రహ్మస్వరూపమును ప్రపంచ మిథ్యాత్వమును కేవలజ్ఞానముయొక్క మోక్షసాధనత్వమున్ను శాస్త్రము ప్రతిపాదించనేరదనేబుద్ధి అసంభావనయని చెప్పబడును. శాస్త్రము జీవేశ్వరభేదమును ప్రపంచ సత్యత్వమును కర్మసముచ్చిత జ్ఞానముయొక్క మోక్షసాధనమునే తాత్పర్యముచేత ప్రతిపాదించుననేబుద్ధివిపరీతభావన యనబడును॥

గనుక ఓయిశిష్యా ఈభావనాత్రయ నివారణముగల మహానుభావునిగురించి శ్రీభాగవతమునందుకూడా చెప్పబడియున్నది॥

శ్లో॥ దేహంచ నశ్వర మవస్థిత ముత్థితంవా।
సిద్ధో నపశ్యతి యతోధ్య గమత్స్వరూపం।
దైవా దుపేత మథదైవ వశాదపేతం।
వాసోయదా పరికృతం మదిరా మదాంధః॥

తా॥ బ్రహ్మతత్వ సాక్షాత్కారముగల మహానుభావుడునిరంతరము బ్రహ్మానుసంధాన తత్పరుడైయున్నందున నశించు స్వభావముగల యీశరీరము కూర్చొనియుండినా లేక నిలచియుండినా ప్రారబ్ధ కర్మప్రాబల్యమువలన తనతోకూడియుండినా లేక తన్నువిడచిపోయినా

దీనిని మద్యపానపరవశుడైన పురుషుడు తనపైవస్త్రము నేప్రకారము నెరుగకయుండునో ఆప్రకారముగానే యెరుగక యుండును॥

వసిష్ఠమహామునియు నీప్రకారముగానే చెప్పియున్నారు॥

శ్లో॥ పార్శ్వస్థ బోధితాసంతః పూర్వాచార క్రమాగతం।
ఆచార మాచరంత్యేవ సుప్తబుద్ధవ యాదిహ॥

తా॥ బ్రహ్మవేత్తలగువారు బ్రహ్మస్వరూపానుసంధానమగ్నులైనందున బాహ్యప్రపంచము నేమియు నెరుగకయుండి పార్శ్వమందున్న శిష్యులచేత బోధించబడినవారై సాధనదశయందాచరించిన క్రమము ననుసరించి నిత్యనైమిత్తికకర్మలను శరీరయాత్రోపయుక్తవ్యాపారములను సుప్తప్రబుద్ధునివలె నీలోకమునందాచరించుచుందురు॥

ఇందుకు శ్రుతికూడా చెప్పుచున్నది॥

శ్రుతి॥ ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాంవరిష్ఠః॥

తా॥ బ్రహ్మతత్వజ్ఞానముగల పురుషుడు చిత్తవిశ్రాంతితారతమ్యముచేత ఆత్మక్రీడుడని ఆత్మరతుడని క్రియావంతుడని బ్రహ్మవిద్వరిష్ఠుడని నాలుగు విధములుగా చెప్పబడునని శ్రుత్యర్థము॥

ఓయిశిష్యా ఇచ్చట నలుగురు బ్రహ్మవేత్తలు తెలియబడుచున్నారు. అందులో మొదటివాడు బ్రహ్మవేత్తయని రెండవవాడు బ్రహ్మవిద్వరుడని మూడవవాడు బ్రహ్మవిద్వరీయుడని నాలుగవవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడని చెప్పబడును॥

ఓయిశిష్యా ఈనలుగురు యోగభూమికలేడింటిలో నాలుగవభూమి మొదలుకొని క్రమముగా నాలుగుభూమికలను పొందినవారని తెలియుము॥

ఈయోగభూమికలేడింటిని శ్రీవసిష్ఠమహర్షి చెప్పియున్నారు॥

౧॥ శుభేచ్ఛ॥ శ్లో॥ స్థితఃకిం మూఢఏవాస్మి ప్రేక్షేహం శాస్త్రసజ్జనైః।
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతేబుధైః॥

తా॥ నేను మూఢుడనై యెందుకు నిలచితిని సజ్జనసహవాసముచేత సచ్ఛాస్త్రశ్రవణముచేత తత్వమును దెలిసికొనుటకుయత్నిం

చెదననివైరాగ్యపూర్వకముగా కలుగునట్టి ఇచ్ఛ శుభేచ్ఛయని పండి తులచే చెప్పబడినది॥

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకం।
సద్విచారప్రవృత్తిర్యా ప్రోచ్యతేసావిచారణా॥

తా॥ వేదాంతశాస్త్రములనువిని సాధుజన సహవాసము చేసి ఇహలోక పరలోకవయములయందు వైరాగ్యమునుపొంది బ్రహ్మవిచార మునందు ప్రవర్తించుట॥ విచారమనబడును॥		౩ తనుమానసి॥

శ్లో॥ విచారణాశుభేచ్ఛాభ్యా మింద్రియార్థేష్వసక్తతా।
యత్రసాతనుతామేతి ప్రోచ్యతేతనుమానసా॥

తా॥ విచారణచేతను శుభేచ్ఛచేతను విషయవైరాగ్యముతో గూడిన చిత్తము యేదశయందు సూక్ష్మార్థగ్రహణ సామర్థ్యరూప మయిన తనుత్వమునుపొందునో ఆదశ తనుమానసయని చెప్పబడును॥

శ్లో॥ భూమికాత్రితయాభ్యాసంచ్చిత్తేర్థవిరతేర్వశాత్।
సత్వాత్మనిస్థితేశుద్ధే సత్వాపత్తిరుదాహృతా॥

తా॥ ఈచెప్పబడిన మూడుభూముల నభ్యసించుటవల్లను విష యములయందుగలిగిన వైరాగ్యదార్ఢ్యమువలనను సత్యజ్ఞానానందా త్మకమయి అవిద్యాది దోషసూన్యమయిన పరమాత్మస్వరూపమునం దు చిత్తముదృఢముగానిలుచుట సత్వాపత్తి యనబడును॥

శ్లో॥ దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలాతుయా।
రూఢసత్వచమత్కారా ప్రోక్తాసంసక్తినామికా॥

తా॥ శుభేచ్ఛాదిభూమికా చతుష్టయాభ్యాసమువలన సర్వవిష యములయందును బొత్తిగా సంసర్గ లేకయుండి పరమాత్మయందు రూఢమయినస్థితి యసంసక్తియనబడును॥

శ్లో॥ భూమికాపంచకాభ్యాసా త్స్వాత్మారామతయాభృశం।
అభ్యంతరాణాంబాహ్యానాః పదార్థానామభావనాత్।
పరప్రయుక్తేనచిరం ప్రయత్నేనావబోధనం।
పదార్థాభావినినామ షష్టీభవతిభూమికా॥

తా॥ శుభేచ్ఛాది భూమికాపంచకము నభ్యసించి కేవలస్వస్వరూపమునందే దృఢముగా చేరి యానందించు చిత్తమునకు బాహ్యవిషయములుగాని అంతరవిషయములుగాని కనిపించకయుండుటచేత పరులయొక్క ప్రయత్నముచేతనే చిరకాలమునకు వ్యుత్థానముబొందు పురుషునియొక్క దశపదార్థభావినియను ఆరవభూమికగా చెప్పబడును॥

౭వ భూమి॥

శ్లో॥ భూమిషట్కచిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనాత్।
యత్స్వభావైకనిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యగాగతిః॥

తా॥ వెనక ఆరుభూముల నభ్యాసము చేసినందున భేదప్రపంచమెప్పటికిని తోచనందున సర్వకాలసర్వావస్థలయందు పరబ్రహ్మస్వరూపమునందు నిష్ఠకలిగియుండి పరప్రయత్నమువలననైనా వ్యుత్థానమును పొందకయుండుటతురీయమనే యేడవభూమికగా చెప్పబడును

ఓయిశిష్యా మొదటిభూమికాత్రయమునందును ప్రపంచము తోచుచుండును గనుక నీమూడుభూమికలును జాగ్రదవస్థయనబడును॥

నాలవభూమియందు ప్రపంచము స్వప్నమువలె తోచుచుండును గనుక ఈనాలవభూమికను వసిష్ఠమహామునివలన చెప్పబడినది॥

శ్లో॥ అద్వైతేస్థైర్యమాయాంతే ద్వైతేప్రశమంగతే।
పశ్యంతిస్వప్నవల్లోకం చతుర్థీంభూమికామితాః॥

తా॥ చిత్తమునం దద్వితీయపరబ్రహ్మస్వరూపము స్థైర్యమును పొందగానే ద్వైతప్రపంచమంతయు ప్రకాశించక శాంతిని పొంది యుండును॥

ఇట్టినాలుగవ భూమికను పొందినమహానుభావుడు ఈప్రపంచమును స్వప్నప్రపంచమును జూచినట్లు మిథ్యగాచూచుచుండును॥

ఓయిశిష్యా ఈయోగభూమికలు దేవత్వాదిప్రాప్తి సాధనములనే యర్థము కృష్ణార్జునులయొక్క రామవసిష్ఠులయొక్క యు ప్రశ్నప్రతివచనములవల్ల తెలియబడుచున్నది॥

శ్లో॥ అయతిః శ్రద్ధయోపేతః యోగాచ్చలితమానసః।
అప్రాప్యయోగసంసిద్ధిం కాంగతింకృష్ణగచ్ఛతి॥

తా॥ మోక్షమార్గమునందు అల్పప్రయత్నమును చేసినపురుషుడు గురు వేదాంతవాక్యములయందు శ్రద్ధయున్ను శమదమాది గుణములున్ను కలవాడై గురుసమీపమునకుబోయి వేదాంతవాక్య శ్రవణమును చేయుచుండి తత్వసాక్షాత్కారమును పొందకనే మధ్యకాలమునందు మృతిబొందిన నేమిగతిని పొందును॥

శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివనశ్యతి।
అప్రతిష్ఠోమహాబాహో విమూఢో బ్రహ్మణఃపథి।

తా॥ బ్రహ్మాత్మైక్యజ్ఞానములేనివాడైనందున ముక్తినిబొందక కర్మలను ఉపాసనలను ఎడచినందున స్వర్గలోకబ్రహ్మలోకములనుబొందక ఉభయభ్రష్టుడై చెదరిపోయిన మేఘమువలె నశించిపోడుగదా॥

* శ్రీకృష్ణమూర్తిచే చెప్పబడిన యుత్తరము. *

శ్లో॥ పార్థనైవేహనాముత్ర వినాశ స్తస్యవిద్యతే।
నహికల్యాణకృత్కశ్చి దుర్గతింతాతగచ్ఛతి॥

తా॥ ఓయర్జునా బ్రహ్మవిద్యావిచారము చేయుపురుషుడు ఈలోకమునందుగాని పరలోకమునందుగాని చెరుపునుపొందడు॥

పుణ్యకార్యములనుజేయువానికి యీలోకమున నపకీర్తిగాని పరలోకమునందు నరకముగాని కలుగనేరదు॥

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాంలోకా నుషిత్వాశాశ్వతీస్సమాః।
శుచీనాంశ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే॥

తా॥ బ్రహ్మసాక్షాత్కారముకొరకు ప్రయత్నమునుచేయుచు సాక్షాత్కారము కలుగకముందే మరణించినపురుషుడు మరణకాలమునందు భోగవాసనలు కలవాడై మరణించిన అశ్వమేధాది మహాపుణ్యకార్యములనుచేసిన మహానుభావులుపొందే బ్రహ్మలోకాదిలోకములను అర్చిరాది మార్గమువలన ప్రవేశించి యచ్చట సమస్తభోగములను

